[illegible]

1 రాగమణి _ 3 

# మధుర ప్రణయం

(మిస్టరీ సీరియల్)




రచన

డా॥ మల్లికార్జున రావు

ఎం.వి.యస్. పబ్లికేషన్స్,
(ఎం.వి.యస్. ప్రెస్)
66. కోడంబాకం హైరోడ్,
మద్రాసు.17.

ప్రథమ ముద్రణ: ఆగస్టు, 1958.

వెల : 60 నయాపైసలు



ఈ నవలలోని పాత్రల పేర్లూ, సంఘటనలూ, ప్రదేశాలూ కేవలం కల్పితాలు. ఎవరినీ ఉద్దేశించి వ్రాసినవి కావు.

ముద్రణ

ఎం. వి. యస్. ప్రెస్, మద్రాసు-17

3

రాజకుమారి రాగమణి మరణ వార్త పురమంతా వ్యాపించింది. ప్రజలు తండోప తండాలుగా వచ్చి కోటలో ప్రవేశిస్తున్నారు. ఆ భీకర దృశ్యాన్ని చూడలేక కొందరు వెంటనే తిరిగి వెళ్ళిపోతూంటే, మరికొందరు చూస్తూన్న వాళ్లు చూస్తూన్నట్టే శిలా ప్రతిమల్లా నిలబడిపోతున్నారు.

అంతఃపురమంతా ఏడ్పులతోను, పెడబొబ్బలతోను నిండిపోయింది. ఆ గోలలో ఒకరి మాట మరొకరికి వినపడే సావకాశం కూడా లేకుండా పోయింది.

గుమ్మానికి చేరబడిపోయిన జితేంద్రుడు వచ్చిన వారితో తనకు నిమిత్తం లేదన్నట్టుగా శూన్యంలోకి చూస్తూ ఉండిపోయాడు. కాని, అంతలోనే ప్రజలతోపాటు అక్కడకు వచ్చిన పిచ్చివాడొకడు జితేంద్రుడ్ని సమీపించాడు. లోపలకు పోయిన కళ్ళు, ముందుకు పొడుచుకు వచ్చిన ముక్కు, మడతలు పడిన నొసలు, ముడతలు పడిన ముఖము - అతని ముసలి తనాన్ని తెలియజేస్తున్నాయి. చింపిరి జుట్టుతోను, చింకిరి గుడ్డలతోను ఉన్న ఆ పిచ్చివాని చేతిలో ఒక మట్టి బొమ్మ కూడా ఉంది.

పిచ్చివాడు జితేంద్రుడ్ని చేరి అతను చూస్తున్న వైపే శూన్యంలోకి ఒకసారి చూశాడు. తర్వాత తన చేతిలో ఉన్న బొమ్మను పైకెత్తి 'మెదడులో లోపం లేకుండ ఉంటె మృత్యువు దరికి రానే రాదోయ్ - మాయ బొమ్మరా, మట్టి

బొమ్మరా, మనిషి బొమ్మ యిది కానే కాదోయ్!' అంటూ ఆ బొమ్మను క్రిందికీ మీదికీ, త్రిప్పుతూ నిదానించి చూడ్డం ప్రారంభించాడు.

జితేంద్రుడు పిచ్చివాడన్న మాటలు విని ఉలిక్కిపడ్డాడు. అతను వెంటనే చూపు మరల్చుకుని ఆ పిచ్చివాని వంక ఆశగా చూశాడు.

అంతవరకు ఆ బొమ్మను ఆడిస్తూ దాన్నే చూస్తున్న పిచ్చివాడు అంతలోనే వెనక్కి తిరిగి 'నమ్మమురా నరుడా...., దేహము చెందుమురా నరుడా-దేవుడు లేడను అతివాగుడు ఇక మానుమురా నరుడా!' అని కూనిరాగం తీసుకుంటూ చేతిలో ఉన్న బొమ్మను నేలకు వేసి కొట్టి అక్కడున్న జన సమూహంలో కలిసిపోయాడు. నేలమీద పడిన బొమ్మ ముక్కలు-ముక్కలై నాలుగు మూలలకు చెదిరిపోయింది.

జితేంద్రుని చూపు నేలమీద పడింది. అతని దృష్టి పగిలిపోయిన ముక్కలమీద నిలిచింది. అతని మెదడు పని చేయడం మొదలుపెట్టింది. పిచ్చివాడన్న మాటలన్నీ జితేంద్రుడు ఒకసారి స్ఫురణకు తెచ్చుకున్నాడు. ఆ మాటలకు అతనొక అర్థాన్ని కల్పించుకున్నాడు. అమితానందంతో అతను ఎగిరిపడ్డాడు. 'మీరెవ్వరు విచారించ వలసిన అవసరం లేదు. కంట తడిపెట్టవలసిన అగత్యం లేదు. రాజకుమారి, సుమతి బ్రతికే ఉన్నారు. ఇదంతా శత్రువుల తంత్రం. మహారాజా! నా మాట నిజం!' అన్నాడు గట్టిగా.

జితేంద్రుడు అన్న మాటలు విని అక్కడ ఉన్న వాళ్ళందరూ అదిరిపడ్డారు. ఏడుపులు మాని సంభ్రమాశ్చర్యాలతో అతన్నే చూడ్డం మొదలుపెట్టారు.

మహారాణి మణిగర్భ జితేంద్రుని రెండు చేతులు పట్టుకుని 'నాయనా! జితేంద్రా! ఏమిటీ-అన్నావు? చచ్చిన పాము

ఇంకా ఇక్కడే పడి ఉంది. నా కుమార్తె శవం కళ్ళ ముందే కనబడుతూంది. ఇంకా రాగమణి బ్రతికే ఉందంటే ఎలా నమ్మగలను?' అంటూ మళ్ళీ ఏడవసాగింది.

'అమ్మా! మహారాణీ! నేను అబద్ధం చెప్పడం లేదమ్మా! రాజకుమారిని, సుమతిని ప్రతాపసింహుని గూఢచారులు ఎత్తుకుపోయారు. ఇక శవాల మాటంటారా; ఇవి నిజమైన శవాలు కావు; ఆ గూఢచారులు తయారు చేసిన కృత్రిమ ప్రతిమలు. రాజకుమారి, సుమతి మరణించారని మనకు నమ్మకం కలిగించడం కోసం ఇలా చేశారు. అంతే!' అన్నాడు జితేంద్రుడు.

'రాజకుమారి మరణించిందని నమ్మించడంలో వాళ్ళ ఉద్దేశం ఏమిటి?' అన్నాడు మంత్రి బలభద్ర దేవుడు.

'రాజకుమారి కోసం మనం వెదకకుండా చేయడానికే వాళ్ళు అలా చేశారు.'

'జితేంద్రా! ఇవి నకిలీ శవాలని ఎలా చెప్పగలవు?' మహారాజే స్వయంగా అడిగాడు.

'మహారాజా! శవాల దగ్గరకు నడవండి, వివరంగా చెబుతాను,' అని జితేంద్రుడు శవాలు ఉన్న వైపుకు నడిచాడు. మహారాజా, మహారాణి, మంత్రి-అతన్ని అనుసరించారు.

జితేంద్రుడు సుమతి శవం దగ్గరకు వెళ్ళి కత్తితో ఒక కాలు నరికాడు. దాన్ని మహారాజుకు చూపిస్తూ 'మహారాజా! ఈ కాలులో ఎముక ఉన్నదేమో చూడండి!' అన్నాడతను.

మహారాజా, బలభద్ర దేవుడు కూడా ఆ కాలును బాగా పరీక్షించి చూశారు. కాని, దానిలో ఎక్కడా ఎముక కనబడ లేదు. ఆ ఇద్దరూ ఆశ్చర్యంగా ఆ కాలునే చూస్తూండగా జితేంద్రుడు రాజకుమారి శవం నుంచి కూడా ఒక కాలు

వరికి వారికి చూపించి 'మహారాజా! ఇవి బొమ్మలని ఇప్పటి కైనా నమ్మండి,' అన్నాడు.

మహారాజా కీర్తిసేనుడు ఒక నిట్టూర్పు విడిచి 'జితేంద్రా! ఇప్పుడు రాగమణి మరణించలేదని పూర్తిగా నమ్మకం కలిగింది. కాని, అంతమాత్రంచేత ఎలా తృప్తిపడగలం? ఆమె శత్రువుల చేతుల్లో ఎన్ని కష్టాలు అనుభవిస్తూందో?......' అన్నాడు దిగులుగా.

'జరిగిపోయిన దానికి విచారించినందువల్ల ప్రయోజనం లేదు. మీరు ధైర్యంగా ఉండండి. రాజకుమారిని, సుమతిని ఎక్కడ ఉన్నా వెదికి తీసుకు వస్తాను,' అని అనేక విధాల మహారాజుకు, మహారాణికి నమ్మకం కలిగించాడు జితేంద్రుడు.

కొంత వరకు ధైర్యం చేకూరిన మహారాజు నేలమీద పడి ఉన్న రాజకుమారుని పరిస్థితి చూశాడు. తెలివి తప్పి పడి పోయిన సాగర్ కి ఇప్పటికీ తెలివి రాలేదు. అతను అలానే జీవచ్ఛవంలా నేలమీద పడి ఉన్నాడు. మహారాజు వెంటనే రాజ వైద్యుల్ని రప్పించాడు. వచ్చిన వైద్యులు రాజ కుమారుడు గుణసాగర్ కి తెలివి కలిగించడానికి ఎన్నో పాట్లు పడ్డారు. కాని, ప్రయోజనం లేకపోయింది. జితేంద్రుడు కూడా అనేక విధాల ప్రయత్నించాడు. అయినా ఫలితం కనిపించలేదు.

మహారాజు, మహారాణి చాలా వ్యాకులపడుతున్నారు. వారు పడుతున్న ఆందోళన గమనించాడు జితేంద్రుడు. కాసేపు దీర్ఘంగా ఆలోచించి, అతను మహారాజును సమీ పించాడు. 'మహారాజా! దిగులు పడవలసిన పనిలేదు. గుణ సాగర్ దేహాన్ని అతని గదికి తీసుకుపోయి చికిత్స చేస్తాను,' అన్నాడు.

మహారాజు అందుకు అంగీకరించగానే జితేంద్రుడు గుణసాగర్ దేహాన్ని భుజంమీద వేసుకుని అతని గదిలోకి తీసుకుపోయి మంచంమీద పరుండబెట్టాడు. తలుపులన్నీ లోపల గడియపెట్టి వచ్చి, గుణసాగర్ దగ్గర కూర్చుని, అతని చెవి దగ్గర నోరు ఉంచి 'సాగర్! రాగమణి మరణించలేదు; బ్రతికే ఉంది. చూడండి, ప్రతాపసింహుని గూఢచారులు ఆమెను ఎత్తుకు పోతున్నారు. తొందరగా లేవండి. ఆమెను విడిపించాలి. అరెరె! చాలా దూరం తీసుకు పోయారే! ఈ సమయంలో వాళ్ళను ఎదిరించి విడిపించకపోతే ఇక మీకు రాగమణి దక్కదు. ఇంకా లేవరేం! ఇదేనా వీరత్వం?... ప్రేయసిని ప్రత్యర్థులు తీసుకు పోతూంటే మౌనం వహించడం భావ్యం కాదు. ప్రేమించిన ప్రియురాల్ని శత్రువులు బాధిస్తూంటే చూస్తూ ఊరుకోవడమేనా మధుర ప్రేమలో ఉన్న మర్మం! మీ ప్రేమే నిర్మలమైనదైతే మీ ప్రేయసిని తప్పకుండా రక్షించుకుంటారు. శత్రువుల చేతిలోంచి ఆమెను విడిపించుకుంటారు. సాగర్! లేవండి. రాజకుమారిని శత్రువులు లాక్కుపోతున్నారు.' అన్నాడు నెమ్మదిగా జితేంద్రుడు.

జితేంద్రుడన్న మాటలు చెవిలో పడ్డంతోనే 'ఏమిటి? ఎవరు తీసుకుపోతున్నారు? రాగమణి ఎక్కడ ఉంది? నాకీ మాటలు ఎవరు చెపుతున్నారు?' అంటూ గుణసాగర్ కళ్ళు విప్పాడు.

గుణసాగర్‌కి తెలివి రావడంతో జితేంద్రుడు ఆనందంగా అతనికి బాగా సమీపంగా కూర్చుని 'సాగర్! ఆ మాటలన్నీ నేనే చెప్పాను. అందులో ఏమీ అబద్ధం లేదు కూడా,' అన్నాడు.

సాగర్ - జితేంద్రుడ్ని బాగా పరిశీలించి చూశాడు. 'జితేంద్రా! నీకు మతిపోయిందా?' అన్నాడు అనుమానంగా.

'లేదు. ఒక్క నిమిషం ఉంటే అంతా మీకే తెలుస్తుంది,' అంటూ జితేంద్రుడు తలుపు తీసి బయటకు చూశాడు.

మహారాజు కీర్తిసేనుడు, మంత్రి బలభద్ర దేవుడు గుమ్మం ముందే నిలబడి ఉన్నారు. జితేంద్రుడ్ని చూడ్డంతోనే 'ఎలా ఉంది?' అంటూ ఆత్రుతగా ముందుకు వచ్చాడు మహారాజు.

'తెలివి వచ్చింది మహారాజా! వెళ్ళి చూడండి,' అన్నాడు జితేంద్రుడు.

మహారాజు, మంత్రి - సాగర్ ఉన్న గదిలో ప్రవేశించగానే జితేంద్రుడు తొందరగా రాగమణి భవనంలోకి వెళ్ళి, శరీరాలనుంచి నరికి వేరు చేసిన రెండు కాళ్ళనూ తీసుకుని గుణసాగర్ దగ్గరకు వచ్చాడు. వాటిని రాజకుమారునికి చూపుతూ 'సాగర్! చూడండి, ఈ కాళ్ళలో ఎముకలే లేవు!' అన్నాడు జితేంద్రుడు.

గుణసాగర్ జితేంద్రుడ్ని గట్టిగా కౌగలించుకున్నాడు. 'జితేంద్రా! మహారాజు అన్ని విషయాలు విపులంగా చెప్పారు. ఆ ద్రోహులు చాలా అన్యాయానికి తలపడ్డారు. తగిన ప్రతీకారం చేసి తీరాలి,' అన్నాడు.

'రాజకుమారా! తొందరపడితే ప్రయోజనం లేదు. మీకు తెలివి కలగడానికి చాలా సమయం పట్టింది. ఇప్పుడు రాత్రి మొదటి జాము గడుస్తూంది. ఉదయం వరకు విశ్రాంతి తీసుకోండి. ఏమి చేయవలసిందీ తర్వాత ఆలోచిద్దాం,' అన్నాడు జితేంద్రుడు.

మంత్రి బలభద్ర దేవుడు కూడా జితేంద్రుడన్న మాటలను సమర్థించాడు.

ఉద్దేశానికి వ్యతిరేకంగా ఉన్నా, రాజకుమారుడు విశ్రమించక తప్పలేదు.

తెల్లవారింది. మహారాజా కీర్తిసేనుడు, గుణసాగర్, జితేంద్రుడు కూర్చుని మాట్లాడుకుంటూండగా మంత్రి బలభద్ర దేవుడు వచ్చి మహారాజుకు నమస్కరించి 'మహారాజా! మనం ఖైదు చేయబడిన శత్రు గూఢచారులు తప్పించుకుపోయారు,' అన్నాడు దిగులుగా.

'పహారా సైనికులు ఏమయ్యారు?'

'మహారాజా! ఆగ్రహపడకండి. రాజకుమారి మరణించిందని తెలియడంతో అక్కడ ఉన్న సైనికులలో చాలమంది అంతఃపురంలోకి వచ్చారు. ఆ అవకాశం చూసుకుని శత్రువులు అక్కడ మిగిలి ఉన్న మన సైనికులను గాయపరచి తమ గూఢచారులను విడిపించుకుపోయారు,' అన్నాడు మంత్రి.

రాజకుమారుడు లేచి నిలబడ్డాడు. కోపం వల్ల అతని శరీరం కంపించిపోతూంది. 'రాజకుమారిని, సుమతిని బంధించి తీసుకుపోయారు. శత్రు గూఢచారులు మన అదుపులోంచి తప్పించుకుపోయారు. ఇక సహించడానికి వీల్లేదు. వెంటనే దీనికి సమాధానం చెపుతాను. మనం ఇప్పుడే యుద్ధానికి బయలుదేరాలి,' అన్నాడు.

రాజకుమారుడు అలా అంటూండగానే కాపలా సిపాయి లోపలకు వచ్చి 'యుద్ధభూమినుంచి వార్తాహరుడు వచ్చాడు. తమ దర్శనం కోరుతున్నాడు,' అన్నాడు మహారాజుతో.

'వెంటనే ప్రవేశపెట్టు,' అన్నాడు బలభద్ర దేవుడు.

వార్తాహరుడు లోపలకు వచ్చాడు. అతను మహారాజుకు నమస్కరించి 'మహారాజా! శత్రువులను ఎదిరించడానికి పంపించిన ముసల్మాన్ సైనికులు యుద్ధ సమయంలో పారిపోవడం మొదలుపెట్టారు. అది చూసి మన ఫిరంగి దళం వెనుకనుంచి ఆ సైనికుల మీద గుళ్ళ వర్షం కురిపించింది. దాని

ఫలితంగా నాలుగు వంతుల్లో ఒక వంతు సైనికులు వెంటనే మరణించారు. మిగిలినవాళ్ళు పారిపోవడానికి వీలు చిక్కలేదు. దానితో వాళ్ళ ఉద్దేశం మార్చుకున్నారు. పారిపోవడానికి ప్రయత్నించి, ఫిరంగి గుళ్ళకు బలి అయ్యేకన్న పోరాడి చావడం మంచిదనుకున్నారు. ప్రాణాల మీద ఆశ విడిచిపెట్టి పోరాడ్డంలో రెండు వేల శత్రు సైనికుల్ని హతమార్చారు. కాని, మన సైనికుల్లో ఒక్కరు కూడా మిగల్లేదు. తమరు వెంటనే సహాయాన్ని అందజేయకపోతే మన ఫిరంగి దళం కూడా నాశనమైపోతుంది,' అన్నాడు.

వార్తాహరుడు చెప్పిన మాటలు వినగానే మహారాజు బలభద్ర దేవుని వైపు చూశాడు. 'సైన్యాన్నంతనూ వెంటనే యుద్ధభూమికి పంపండి. నేనే స్వయంగా ఆ ప్రతాపసింహునితో పోరాడతాను,' అన్నాడు.

'మహారాజా! మీరు యుద్ధం చేయవలసిన అవసరం లేదు. నేనే వెళ్ళి అతనికి తగిన బుద్ధి చెపుతాను. ఆ ప్రతాపుడు తనే గొప్ప బలవంతుడ్ననీ, వీరుడిననీ మిడిసిపడుతున్నాడు. అతని బలమెంత ఉందో చూస్తాను! మీరు ఇక్కడే ఉండి రాజ్యకార్యాలను చూడండి,' అన్నాడు గుణసాగర్.

మహారాజు అందుకు మొదట అంగీకరించకపోయినా చివరకు ఇష్టపడక తప్పలేదు.

మంత్రి బలభద్రదేవుడు సైన్యానికి ఆజ్ఞ ఇవ్వడంలో నిమగ్నుడయ్యాడు.

అదే సమయంలో 'చచ్చినవాళ్ళను బ్రతికించిన వాళ్ళుంటే జితేంద్రుడ్ని కలుసుకోండి!' అని చాటింపు వేయించాడు జితేంద్రుడు.

## 32

సూర్యాస్తమయం అవుతూంది...

యుద్ధభూమిలో వేసిన తన గుడారంలో కూర్చున్న గుణసాగర్ సైన్యాధిపతి ఆదిత్యునితోను, జితేంద్రునితోను మాట్లాడుతున్నాడు.

అంతలో రణధీర్ గుడారంలో ప్రవేశించి రాజకుమారునికి, జితేంద్రునికి నమస్కరించి కూర్చున్నాడు.

'రణధీర్! నువ్వు సుందరగడం వచ్చినప్పటినుండి ముఖ్యమైన పనులు ఏమి చేశావు?' అన్నాడు గుణసాగర్ అతన్ని చూస్తూ.

'రాజకుమారా! ఆ విషయం నన్నడగండి; నేను చెబుతాను. మీరు రాగమణితో కలిసి ఉద్యానవనంలో ఉండగా భూతం గోల చేసి వెళ్ళిపోయింది. అప్పుడు మిమ్మల్ని నేను బలవంతంగా అక్కడినుండి బయటకు తీసుకుపోయాను. గుర్తుందా? రణధీరే అలా భూతం వేషంలో వచ్చి 'మహారాజా వస్తున్నాడు! జాగ్రత్త!' అని సాంకేతిక భాషలో హెచ్చరించాడు. దుర్ముఖి ప్రచండ దుర్గం వెళ్ళి మహారాజా ప్రతాపసింహుని గూఢచారుల్ని తీసుకు వస్తున్న విషయం కూడా ఇతనే తెలియజేశాడు. రాజకుమారి రాగమణి మరణించిందని మీరు తెలివి తప్పి పడిపోయినపుడు సుందరగడంలో ఉన్నవాళ్ళంతా దుఃఖిస్తుండగా, ఏమి చేయడానికీ తోచక నేను తికమకలు పడుతూన్న సమయంలో-రాగమణి, కుమతి మరణించలేదనీ, బ్రతికే ఉన్నారనీ, అదంతా శత్రువుల మోసమనీ తెలియపరచి మనందరినీ రక్షించినది రణధీరే! ఇతని వల్లే ఇన్ని పనులు జరిగాయి. ఇంకా నెరవేర వలసిన పనులెన్నో ఉన్నాయి.

అందుచేతే ఇతని కోసం ఈదయం చాటింపు వేయించాను,' అన్నాడు.

రాజకుమారుని ఆనందానికి అంతులేకపోయింది. అతను రణధీర్‌ని చాలా అభినందించాడు. కాని, అంతలోనే గుణ సాగర్ ముఖం నిండా విచారం అలుముకుంది. అతనిక ఏమీ మాట్లాడకుండా కూర్చుండిపోయాడు.

రాజకుమారి రాగమణి వియోగం వల్లనే గుణసాగర్ బాధపడుతున్నాడని జితేంద్రుడు తెలుసుకున్నాడు. సుమతి వియోగంతో అతను కూడా అలానే వ్యాకులపడుతున్నాడు. కాని, ఆ విషయం పైకి వ్యక్తం కాకుండా 'రణధీర్! రాజ కుమారి ఎక్కడ ఉందో నీకు తెలుసా?' అన్నాడు.

'రాజకుమారి ఎక్కడ ఉన్నదీ తెలియదు; కాని, ఆమెను సుమతిని - శంకరదాసు, నజీరుద్దీన్ కలిసి తీసుకుపోయారు. అది మాత్రం నిజం!' అన్నాడు రణధీర్.

'రణధీర్! రేపు తప్పకుండా యుద్ధం ప్రారంభమౌతుంది. ఇక్కడ ముఖ్యంగా గూఢచారుల అవసరం చాలా వుంది. అయితే రాజకుమారిని తొందరగా వెదకడం కూడా అవ సరం. నేను ఇక్కడే ఉండి నిన్న రాజకుమారి కోసం పంపించాలంటే నీకు ప్రచండ దుర్గంలో ఉన్న ఆ కొండలు సరిగా తెలియవు. ఆమెను తప్పకుండా ఆ కొండల్లోనే ఎక్కడో దాచి ఉంటారు. అందుచేత నేనే రాజకుమారిని వెదకడానికి వెడతాను. నువ్వు ఇక్కడే ఉండు,' అని జితేం ద్రుడు సాగర్ వైపు చూశాడు. 'రాజకుమారా! మీ దగ్గర రణధీర్ వుంటాడు. నేను లేని లోపం కనబడనీయడు. యుద్ధ సమయంలో మాత్రం ఆవేశంతో తొందర పడకండి. నేను

'ఆదిత్యా! శత్రువు బలానికి భయపడి వేలకు వేల సైనికులను యుద్ధ భూమికి బలిచేయ లేను. అయినా విజయలక్ష్మి కలకాలం ఒక్కడినే వరించదు. జయాపజయాలు దేవుడే నిర్ణయిస్తాడు,' అని—'రణధీర్! నువ్వు వెళ్ళి ప్రతాపసింహునికి నా అభిప్రాయం తెలియజెయ్యి,' అన్నాడు గుణసాగర్.

ఆదిత్యుడు ఇంకేమీ అనలేకపోయాడు. కాని, అతని మనస్సు కీడునే శంకించసాగింది. ప్రతాపసింహుడు రాజకుమారుని చేతిలో ఓడినా, నియమానికి కట్టుబడి యుద్ధం మాని తిరిగి వెళ్ళిపోతాడని ఆదిత్యునికి నమ్మకం కలగలేదు. అంతే కాకుండా ప్రతాపుడు ఈ అవకాశాన్ని విడిచి పెట్టకుండా ఏదో కుట్రపన్ని రాజకుమారిని అంతం చేయడానికి కూడా పూనుకుంటాడని అతను అనుమానించాడు. రణధీర్ ప్రతాపసింహుని సైన్యం వైపు వెళ్ళగానే ఆదిత్యుడు తన సైన్యంలో వున్న వారిలో నమ్మకమైన కొందరు వీరయోధులను వెంట బెట్టుకుని రాజకుమారునికి సమీపంగా నిలబడ్డాడు.

రణధీర్ శత్రు సైనిక [illegible] తన చేతిలో వున్న
జెండా పైకెత్తి గా [illegible] డు. అది గూఢ
చారులను [illegible] పోగుతున్న
జెండాను [illegible] ్యంలో వున్న
దేవ [illegible] లుసు [illegible]

వెళ్ళివస్తాను,' అని గుణసాగర్‌కి నమస్కరించి బయటకు వెళ్ళి భీకరమైన ఆ యడవిలో అదృశ్యమైపోయాడు జితేంద్రుడు.

# 33

తెల్లవారుతూండగా మహారాజు ప్రతాపసింహుని సైన్యాలు రణభేరి మ్రోగించాయి. దానికి సమాధానంగా గుణసాగర్ సేన కూడా యుద్ధభేరి మ్రోగించి పోరాటానికి సిద్ధమైంది.

గుణసాగర్ కవచం ధరించి, కత్తి చేతబట్టి, అరబ్బీ గుర్రాన్నెక్కి వచ్చి యుద్ధ భూమిలో నిలచాడు. రణధీర్ అతని ప్రక్కనే నిలబడ్డాడు.

'రణధీర్! ప్రతాపసింహుడే గొప్ప శక్తివంతుడని, అతనికి సాటి మరొకరు లేరని మహా గర్వపడుతున్నాడు. బలాబలాలు చూసుకోవాలంటే అతని [illegible] పోరాడమని చెప్పు. మా ఉభయుల్లో ఎవరు [illegible] యుద్ధంలో పరాజయం పొందినట్లు ఆ [illegible] వేలకొద్దీ సైనికుల ప్రాణాలు క[illegible] ండి, ధైర్యం [illegible] లవాడైతే [illegible] నా మాట [illegible] చెప్పు [illegible] గా!'

మాటలుగా మీ మహారాజుకు తెలియజెయ్యి,' అన్నాడు రణధీర్.

'మా మహారాజా అందుకు ఏమీ అడ్డు చెప్పరు. అయినా సింహం నోట్లో చెయ్యి పెట్టడానికి సాహసించిన మీ రాజ కుమారుని ధైర్యానికి మెచ్చుకోవాలి!'

'ఆ మాటలు తర్వాత చెపుదువు గాని, ముందు మీ మహా రాజా అంగీకారం తెలుసుకుని రా.'

'అదెంత! ఇప్పుడే వస్తాను,' అని దేవానందం తన సైన్యం లోకి పోయి మహారాజా ప్రతాపసింహునితో రణధీర్ అన్న మాటలన్నీ చెప్పాడు.

మహారాజా ప్రతాపసింహుడు ఆ మాటలు విని నిప్పు త్రొక్కిన కోతిలా చిందులు త్రొక్కుతూ మైదానంలోకి వచ్చాడు. రాజకుమారుడు కూడా అంతకు ముందే మైదానం లోకి వచ్చి నిలబడ్డాడు.

రాజకుమారుడ్ని చూడగానే ప్రతాపసింహుని కోపం పెరిగిపోయింది. 'సాగర్! ఇది ప్రణయ కలాపాలు సాగించడం కాదు, ఆడవాళ్ళ దగ్గర ప్రగల్భాలు కొట్టడం కాదు, హంస తూలికాతల్పం మీద శయనించడం కాదు, వెన్నెల రాత్రుల్లో విహరించడం కాదు; కదనరంగంలో నిలచి కత్తి పట్టడం సామాన్య విషయమనుకున్నావా? ముఖ్యంగా నాలాంటి వీరు నితో తలపడ్డం క్షేమం కాదు. బ్రతుకు మీద ఆశ ఉంటే యుద్ధభూమి విడిచి పారిపో! లేకపోతే ప్రాణాలు దక్కవు!' అన్నాడు.

ఆ మాటలకు సాగర్ శరీరంలోని రక్తం ఉడికిపోయింది. అతని చెయ్యి కత్తి పిడి మీదకు పోయింది. సాగర్ మహా రాజాను ఉరిమి చూస్తూ 'ప్రతాపసింహా! నీ పరాక్రమం ప్రత్యేకంగా చెప్పనక్కర లేదు. రాజకుమారిని దొంగతనంగా

అపహరించడంలోనే నీ శక్తి వ్యక్తమైంది! కబుర్లతో కాలం వృథా చేయక కత్తి కలుపు,' అన్నాడు.

పారశీక గుఱ్ఱం మీద కూర్చున్న ప్రతాపసింహుడు మరు నిమిషంలో బల్లెం, డాలు పట్టుకున్నాడు. అరబ్బీ గుఱ్ఱం మీదున్న గుణసాగర్ కూడా అతన్ని ఎదిరించడానికి తయా రయ్యాడు.

రెండు పక్షాల సైనికులూ మైదానంలో ఉన్న గుణసాగర్, ప్రతాపసింహులను చూస్తూ నిలబడిపోయారు.

మహారాజు రెప్పపాటు కాలంలో గుణసాగర్ మీద విరుచుకుపడి, ఎత్తి ఉంచిన బల్లాన్ని అతని గుండెలకు గురిపెట్టి, పొడిచాడు. గుణసాగర్ అతి లాఘవంగా డాలుతో ఆ పోటును కాచుకుని, తన బల్లాన్నెత్తి పూనించి ప్రతాపసింహుని బల్లెం మీద కొట్టాడు. అంతే! ప్రతాపసింహుని చేతిలో ఉన్న బల్లెం పట్టు తప్పి నేల మీద పడిపోయింది. వెంటనే ప్రతాప సింహుడు కత్తి దూసి ముందుకు ఉరికాడు. సాగర్ కూడా బల్లెం విడచి కత్తి పట్టుకున్నాడు.

ఇరు సేనలూ విరోధం మరచి ఆ ఉభయుల యుద్ధపాటవాన్ని తిలకించసాగాయి.

జాతి గుఱ్ఱాలు రెండూ ఒకదానికి మరొకటి తీసిపోని విధంగా లంఘిస్తూండగా ప్రతాపసింహ, గుణసాగర్‌లు ప్రాణాల మీద ఆశ విడచిపెట్టి పోరాడుతున్నారు.

మధ్యాహ్నం గడచినా యుద్ధం సాగుతూనే ఉంది. మదించిన ఏనుగులా కనబడుతున్నాడు ప్రతాపసింహుడు; సింహం పిల్లలా ఉరుకుతున్నాడు గుణసాగర్.

ఉభయుల దుస్తులు రక్తంతో తడిసిపోతున్నాయి. అయినా ఎవ్వరూ వెనుకంజ వేయడం లేదు. కోడె త్రాచుల్లా ఒకరి

మీదకు మళ్లీ కరు దూసుకు వస్తున్నారు. ప్రతాపసింహుని కత్తి గుణసాగర్ మెడ మీదకు ఎన్నోసార్లు వచ్చింది. గుణసాగర్ కత్తి ప్రతాపసింహుని గుండెల్లో గ్రుచ్చుకోడానికి చాలాసార్లు ప్రయత్నించింది.

జయాపజయాలు నిర్ణయించే శక్తి ఎవ్వరికీ లేకపోయింది. అందరూ కళ్ళు అప్పగించి ఆ వీరయోధుల యుద్ధపాటవాన్ని తిలకించసాగారు. తళతళ్ళాడే కత్తులు రక్తంతో ఎరుపెక్కి చూడ్డానికి భయంకరంగా కనబడుతున్నాయి. ఏ నిమిషంలో ఏం జరుగుతుందో ఎవరూ ఊహించలేకపోతున్నారు.

పోరు ఘోరంగా సాగుతూంది. అంతవరకూ చురుగ్గా ఆడుతున్న గుణసాగర్ కత్తి కదలికలో మార్పు వచ్చింది. కత్తి కదలిక తగ్గింది. అతను కత్తి విసరడం మాని, ప్రతాపసింహుడు కొట్టే దెబ్బలను కాచుకుంటున్నాడు. అతని బలహీనతను గుర్తించిన ప్రతాపుడు విజృంభించి పోరాడసాగాడు.

రణధీర్ రాజకుమారుని స్థితి చూసి కంపించిపోతున్నాడు. సైన్యాధిపతి ఆదిత్యుడు తన సైన్యాన్ని యుద్ధానికి పురికొల్పడానికి సిద్ధపడుతున్నాడు.

గుణసాగర్ యుద్ధం చేస్తూనే తన సైన్యాధిపతి ఉద్దేశాన్ని కనిపెట్టాడు. 'ఆదిత్యా! నియమాన్ని భంగపరచకు. క్షత్రియ ధర్మాన్ని నాశనం చేయకు. నా ప్రతిజ్ఞను పాడు చేయకు.' అన్నాడు దృఢంగా.

గుణసాగర్ ఆదిత్యునితో మాట్లాడడం చూసి ప్రతాపసింహుడు అతన్ని హతమార్చడానికి అదే సమయమనుకున్నాడు. చేతిలోని కత్తిని పైకెత్తాడు. బలమంతా ఉపయోగించి, గురి చూసి, ఎత్తిన కత్తిని సాగర్ మెడ మీద పడేలా విసరాడు.

అది చూసిన ఉభయ సేనల్లోనూ కలకలం బయలుదేరింది. ఆదిత్యుడు కత్తి పట్టుకుని ముందుకు ఉరికాడు. రణధీర్ నెత్తి బాదుకున్నాడు.

ఆ దెబ్బతో సాగర్ తల తెగి నేల మీద పడి దొర్లవల సిందే! కాని, గుణసాగర్ చాలా మెలకువగా ప్రవర్తించాడు. అతను ప్రతాపసింహుడు విసరిన కత్తికి తన కత్తిని అడ్డుపెట్టి, అంతలోనే మెలి త్రిప్పి కొట్టాడు. ఊహించని విధంగా తగిలిన దెబ్బను తట్టుకోలేకపోయాడు ప్రతాపసింహుడు. అతని చేతిలో ఉన్న కత్తి తూలి దూరంగా పడిపోయింది. అదే సమయమని రణధీర్ ఆ కత్తిని తన వశం చేసుకున్నాడు. ఉభయ సేనలూ విరుద్ధభావాలు విడచి 'రాజకుమారునికీ జై!' అన్నాయి.

నిరాయుధుడైన ప్రతాపసింహుడు నిలబడిపోయాడు. అతని గుండె ఒకసారి దడ దడ లాడింది. అవమానంతో అతని శరీరం కంపించిపోతూంది. సిగ్గుతో తల వాలిపోయింది. ఆలోచిస్తే ప్రాణాలు పోతాయని గ్రహించాడతను. వెంటనే సాగర్ మీదకు దూకమని తన సేనకు సౌంజ్ఞ చేశాడు.

మరు నిమిషంలో ప్రతాపసింహుని సైనికులు గుణసాగర్‌ని చుట్టుముట్టారు. ప్రతాపసింహుని సేనలో ఉన్న వీరాధివీరు లందరూ గుణసాగర్‌ని అంతం చేయడానికి సర్వ విధాల పూను కున్నారు. కాని, వాళ్ళ ఉద్దేశం నెరవేరక ముందే ఆదిత్యుడు తన వీరుల సహాయంతో శత్రు సైనికుల్లో చొరబడి గుణ సాగర్‌ని చేరుకుని, అతనికి అండగా నిలబడి పోరాడసాగాడు.

ఉభయ సేనల మధ్య భయంకరమైన పోరు జరిగింది. ప్రతాపసింహుని సైనికులు వేలకొద్దీ మరణించారు. చావగా మిగిలినవాళ్ళు పారిపోవడం మొదలుపెట్టారు.

యుద్ధ భూమి విడిచిపెట్టకపోతే తన ప్రాణాలు కూడా దక్కవనుకున్నాడు ప్రతాపసింహుడు. వెంటనే తన గుర్రాన్ని అదిలించి, అతను కూడా రణరంగానికి దూరమయ్యాడు.

అన్యాయానికి తలపడిన ప్రతాపసింహుడ్ని గుణసాగర్ సైనికులు తరిమి తరిమి విడిచిపెట్టారు.

మహారాజు ప్రతాపసింహుని యుద్ధపరికరాలు, ఆహార పదార్థాలు, గుడారాలు - మొదలైనవన్నీ గుణసాగర్ వశమయ్యాయి.

విజయలక్ష్మిని చేపట్టిన గుణసాగర్ తన గుడారంలో విశ్రాంతి తీసుకుంటూండగా సైన్యాధిపతి ఆదిత్యుడు లోపలకు వచ్చి 'రాజకుమారా! ప్రతాపసింహుడు పారిపోయిన తన సైన్యాన్ని సమీకరిస్తున్నాడట. మనకు నాలుగు మైళ్ళ దూరంలో గుడారాలు వేసుకుని మళ్ళీ యుద్ధానికి తయారౌతున్నాడని వార్తలు వచ్చాయి,' అన్నాడు.

## 34

రాజకుమారి రాగమణి సుమతిని వెదకడానికి బయలుదేరిన జితేంద్రుడు తిన్నగా ప్రచండ దుర్గం చేరుకున్నాడు. మహారాజు ప్రతాపసింహుడు రాగమణిని ప్రచండ దుర్గం కొండల్లోనో, అడవి ప్రదేశంలోనో దాచి ఉంటాడని అతని నమ్మకం. అయినా జితేంద్రుడు కోటలో కూడా వెదకడం మంచిదనుకున్నాడు. అర్ధరాత్రి సమయంలో నల్లని దుస్తులు ధరించి, కోట గోడ దాటి లోపల ప్రవేశించాడు. అన్ని స్థలాలూ వెదుక్కుంటూ మహారాణి పద్మముఖి భవనంలో కాలు పెట్టాడు. అంతవరకు ఎక్కడా అతనికి రాజకుమారిగాని, సుమతిగాని కనబడలేదు.

జితేంద్రుడు నెమ్మదిగా పద్మముఖి పరున్న గది గుమ్మం దగ్గరకు వచ్చాడు. అతను ఆ ప్రదేశాన్నంతనూ పరికించి లోపలకు చూశాడు.

మహారాణి పద్మముఖి బంగారు మంచంమీద నిద్ర పోతూంది. ఆమె మంచం చుట్టూ చాలామంది పరిచారికలు నిద్రపోతూన్నారు.

దీపాల కాంతిలో దేదీప్యమానంగా కనబడుతున్న ఆ గదిలో మహారాణిని చూడగానే జితేంద్రునికి అంతవరకు ఊహించని ఒక క్రొత్త ఆలోచన కలిగింది. 'శత్రువుల చేతిలో చిక్కిన రాజకుమారి, సుమతి - కష్టాలకు గురి కాకుండా ఉండాలంటే మహారాణిని బంధించి తీసుకు పోవాలి. పద్మ ముఖి మా చేతిలో ఉన్నంత కాలం ప్రతాపసింహుడు రాజ కుమారికి ఎలాంటి హానీ తలపెట్టడు. అంతే కాకుండా రాగ మణిని ఎక్కడ బంధించిందీ తెలుసుకోవాలి. అందుకు ఇదే ఉపాయం!' అనుకున్నాడు.

జితేంద్రుడు నిశ్శబ్దంగా గదిలో ప్రవేశించి మహారాణి పద్మముఖి మంచం దగ్గరకు చేరాడు. ఆమెకు మత్తుమందు వాసన చూపించి తెలివి తప్పించాడు. తర్వాత మంచం ప్రక్కనే ఉన్న దంతపు కోళ్ళ బల్లమీంచి కాగితం కలం తీసి ఒక ఉత్తరం రాశాడు. అందులో ఇలా ఉంది.

మహారాజా! తలవని తలంపుగా రాజకుమారి రాగమణిని చూడా లని తలంపు కలిగింది. ఆమె దగ్గరకు వెళుతున్నాను. రాగమణిని బంధించి ఉంచిన ఆ రహస్య ప్రదేశం ఇతరులకు తెలియకూడదనే ఉద్దేశంతో ముఖ్య పరిచారికను కూడా నాతో తీసుకు వెళ్ళడం లేదు. తమ అనుమతి లేకుండా బయలుదేరుతున్నందుకు మన్నించ కోరుతున్నాను. సూర్యోదయం కాకుండా తిరిగి వస్తాను. ఆమె అంగీకరిస్తే నాతో కోటకు తీసుకు వస్తాను....

జితేంద్రుడు అంతటితో ముగించిన ఆ ఉత్తరాన్ని మడచి తలగడ క్రింద ఉంచాడు. తర్వాత ఆ గదిలో ఉన్న పరిచారికల నందరినీ బాగా పరికించి చూశాడు. అందరూ గాఢ నిద్రలో మునిగి ఉన్నారు. వాతావరణం తనకు అనుకూలంగా ఉండి, పరిచారికలకు తెలివి తప్పించవలసిన అవసరం లేక పోయినందుకు సంతోషిస్తూ అతను మహారాణి పద్మముఖిని ఆ మంచంమీద పరచి ఉన్న దుప్పటిలోనే మూట కట్టాడు. జాగ్రత్తగా ఆ మూటను భుజంమీద వేసుకుని చుట్టూ నిదానించి చూసుకుంటూ, ఏ అడ్డూ ఆటంకం లేకుండా కోట లోంచి బయటపడ్డాడు. అతను తొందరగా అడవిలో ప్రవేశించి మహారాణి ఉన్న మూటను ఒక దట్టమైన పొదలో దాచాడు. తర్వాత అతడు మారు వేషం వేసుకుని తిరిగి ప్రచండ దుర్గం వచ్చి కోట గుమ్మం దగ్గర ఎవరికీ కనబడకుండా కూర్చున్నాడు.

తెల్లవారింది. మహారాణి పద్మముఖి మాయమైపోయిన విషయాం ప్రచండ దుర్గమంతా అలుముకుంది. ఆమెను వెదకడానికి అందరూ అన్ని మూలలకూ బయులుదేరారు.

అంతలో యుద్ధంలో ఓడిపోయిన మహారాజా ప్రతాపసింహుడు పదిమంది అశ్విక సైనికుల సహాయంతో ప్రచండ దుర్గం చేరుకున్నాడు.

కోటలో కాలు పెట్టగానే మహారాణి కనిపించడంలేదన్న మాట విని కొయ్యబారిపోయాడు. అతని మెదడు పనిచేయడం మానివేసింది. ఆలోచనలు మందగించాయి.

సైన్యాన్ని మళ్ళీ సమీకరించి, యుద్ధానికి ఆయత్తపరచి, కొంత దూరంలో విడిచిపెట్టి, గూఢచారులందరకు అన్ని పనులూ అప్పగించి, నాలుగు మూలలకు పంపించి కోటకు వచ్చిన మహారాజా వ్యాకులపాటుకు అంతులేకపోయింది.

మహారాజా ప్రతాపసింహుడు తన వెంట ఒక్క గూఢ చారిని కూడా తీసుకు రానందుకు చాలా విచారించాడు. గుణసాగర్‌తో పోరాడి ఓడిపోయాడు. యుద్ధంలో పరా జయం పొందాడు. మహారాణి పద్మముఖి ఇంతవరకు తిరిగి రాలేదు. అన్నివైపులా మహారాజా ప్రతాపసింహునికి అప జయమే కలిగింది. ముఖ్యంగా పద్మముఖి కనిపించకపోవడం అతనికి చాలా దుఃఖాన్ని కలిగించింది. అతను వ్యాకుల హృద యంతో మహారాణి గదిలో ప్రవేశించి, ఆమె మంచం మీద పడి విలపించసాగాడు.

కాసేపటికి అతని దుఃఖభారం తగ్గింది. హృదయాన్ని రాయి చేసుకుని ప్రతాపసింహుడు నాలుగు మూలలా చూస్తూండగా అతని చూపు తలగడ క్రింద ఉన్న ఉత్తరం మీద పడింది. అతనా ఉత్తరాన్ని ఆతృతగా తీసి చదువుకున్నాడు. 'ఇది మహారాణి రాసిన ఉత్తరంలా కని పించడం లేదు. ఈ దస్తూరి ఆమెది కాదని స్పష్టంగా తెలు స్తూంది. అయినా మహారాణికి రాగమణిని దాచిన ప్రదేశం ఎలా తెలుసు? ఆమె ఎక్కడకు వెడుతుంది? ఎలా వెడుతుంది? తప్పకుండా ఇందులో ఏదో మోసం ఉంది. ఎత్తుకు పైఎత్తు వేసి శత్రువులే పద్మముఖిని తీసుకుపోయి ఉంటారు. సమ యానికి ఒక్క గూఢచారి కూడా దగ్గర లేకుండాపోయాడు. పద్మముఖిని తొందరగా వెదికి తీసుకు రావాలి. రాగమణిని బంధించిన చోటు ఆమెకు తెలియదు. అయినా ఆ ప్రాంతంలో కూడా వెదకడం అవసరం. అయితే అక్కడకు ఇతరులను పంపించడం మంచిది కాదు. అలా చేస్తే రహస్యం వెల్లడై పోతుంది. రాగమణి చేతిలోంచి జారిపోతుంది. ఏది ఏమైనా నేనే స్వయంగా అక్కడకు వెళ్ళాలి!' అనుకున్న మహారాజు పగలు వెడితే ఎవరైనా చూస్తారనే అనుమానంతో సాయం

కాలం వరకు కోటలోనే గడిపి, చీకటి పడుతూండగా గుర్రా న్నెక్కి బయటకు వచ్చాడు.

రహస్యంగా కోటగుమ్మం దగ్గర కూర్చున్న జితేంద్రుడు ఆ సమయం కోసమే ఎదురు చూస్తున్నాడు. అతను మహా రాజును చూడగానే లేచి నిలబడి ప్రయాణానికి సిద్ధపడ్డాడు. మహారాజు తప్పకుండా రాగమణి ఉన్న స్థలానికే వెడతాడని, అతన్ని ఏ విధంగాను విడిచిపెట్ట కూడదని నిశ్చయించు కున్నాడు జితేంద్రుడు.

మహారాజు ప్రతాపసింహుడు తన గుర్రాన్ని అరణ్యంవైపు పోనిస్తున్నాడు. జితేంద్రుడు రహస్యంగా మహారాజును వెంబడిస్తున్నాడు.

వెన్నెల రాత్రి అయినప్పటికీ మహారాజు తన గుర్రాన్ని చురుగ్గా పరుగెత్తించడానికి వీలు లేకుండా ఉంది. ఆ దట్ట మైన అడవిలో ఉన్న గచ్చ తీగలు, ముళ్ళ పొదలు అడ్డు తగులుతూ అప్పుడప్పుడు మహారాజు శరీరాన్ని కూడా గాయ పరుస్తున్నాయి. అయినా మహారాజు అవకాశం ఉన్నంత వరకూ గుర్రాన్ని చురుగ్గా నడిపించడానికి ప్రయత్నం చేస్తూ కొంతసేపటికి ఒక లోయను సమీపించాడు.

మహారాజు ఎక్కిన గుర్రం లోయలోకి దిగింది. ఆ లోయకు రెండు వైపుల ఎత్తైన పర్వతాలున్నాయి. ఆ పర్వతాలు కట్టిన గోడల్లా నిలువునా ఉండి, పైకి ఎక్కడానికి గాని క్రిందకు దిగడానికి గాని వీలు లేకుండా ఉన్నాయి. పర్వ తాల మీద ఉన్న చెట్ల కొమ్మలు ఒకదానిలో మరొకటి ఇరుక్కుపోయి, చంద్రుని కాంతి లోయలో పడకుండా చేస్తున్నాయి. గాఢాంధకారంగా ఉన్న ఆ లోయలోకి దిగాక మహారాజు తన గుర్రాన్ని ఒకసారి అదిలించాడు.

మహారాజును వెంబడిస్తూ దూరదూరంగా వస్తున్న జితేంద్రుడు లోయకు కొంచెం దూరంలో ఉండగా మహారాజు అతని దృష్టిలోంచి మాయమయ్యాడు. అంతవరకు తన కళ్ళ ముందు వెడుతున్న మహారాజు అంతలోనే అదృశ్య మవడంతో జితేంద్రుడు చాలా ఆందోళనలో పడ్డాడు. తన ప్రయత్న మంతా వృధా అయిపోయిందని వ్యాకులపడ్డాడు. ఆ సమయంలో మహారాజును వెంబడించలేకపోతే ఇక రాగమణి, సుమతి కనిపించడం కష్టమని భావించాడు. అతను లోయకు సమీపంగా వచ్చి నిలబడి అన్ని వైపులా పరికించసాగాడు. కాని, అతనికి మహారాజు ఎటు వెళ్ళిందీ తెలియలేదు. ఏమి చెయ్యడానికీ తోచక తికమకలు పడుతున్న జితేంద్రునికి మహారాజు గుఱ్ఱాన్ని అదిలించడం వినబడింది.

జితేంద్రుడు ఆ ధ్వని వచ్చిన వైపు చూశాడు. కాని మహారాజుగాని, గుఱ్ఱంగాని అతనికి కనబడలేదు. అనుమానంతో అతను ముందుకు వచ్చి నిదానించి చూశాడు. అతను చూసిన వైపు గాఢాంధకారంగా ఉండి ఏమీ కనిపించడం లేదు; కాని, గుఱ్ఱపు డెక్కల చప్పుడు మాత్రం కొద్ది-కొద్దిగా వినబడ సాగింది. అతనా చప్పుడు వస్తున్న వైపు నడచాడు. అతనొక లోయలోకి దిగుతూన్నట్టు గుర్తించాడు. కన్ను పొడుచుకున్నా కనిపించని ఆ చీకటిలో డెక్కల ధ్వనిని అనుసరించి నడవసాగాడు.

అతనలా రెండు మైళ్ళు వెళ్ళాక ఆ లోయ ఒక చోట వొంకర తిరిగింది. అక్కడకు కొంచెం దూరంలో రెండు కాగడాలు వెలుగుతున్నాయి. ఆ వెలుతురులో అక్కడ ఒక కొండ గుహ ఉన్నట్టు తెలుస్తూంది. బయట కొందరు సిపాయిలు పహరా ఇస్తున్నారు.

మహారాజును వెంబడిస్తున్న జితేంద్రునికి ఆ దృశ్యం

చూడగానే చాలా సంతోషం కలిగింది. తను ఆలోచించి రాసిన ఉత్తరంవల్ల కోరిన స్థలానికి చేరగల్గుతున్నందుకు అతనెంతో ఉత్సాహపడ్డాడు.

మహారాజు గుహను సమీపించాడు. అక్కడ కాపలా కాస్తున్న సిపాయిలు మహారాజును చూడ్డంతోనే ఆయనకు వొంగి నమస్కరించారు.

మహారాజు ప్రతాపసింహుడు సిపాయిల వందనాలను స్వీకరించే స్థితిలో లేడు. అతను ఆతృతగా గుహలోకి చూశాడు. రాజకుమారి రాగమణి, సుమతి - రాతి పలకల మీద కూర్చుని ఉన్నారు. ఆ ఇద్దరు మహారాజును చూడగానే ఒకరి నొకరు చూసుకుని, కళ్ళతోనే ఏదో మాట్లాడుకుని లేచి నిలబడ్డారు. మహారాజు ఆ చూపుల్లో ఉన్న అంతరార్థం ఏమిటో తెలుసుకోలేకపోయాడు. అతను మహారాణి పద్మ ముఖి మీదే మనస్సు లగ్నం చేసి ఉండటంవల్ల మరో విష యాన్ని గమనించే స్థితినే కోల్పోయాడు. అతను గుహలో నలు మూలలా ఆందోళనగా చూడసాగాడు. ఆ గుహలో ఎక్కడా అతనికి పద్మముఖి మాత్రం కనబడలేదు. మహా రాజు వ్యాకులపాటుకు అంతులేకపోయింది. పైకి ఉబుకు తూన్న దుఃఖాన్నతడు అతి కష్టంమీద దిగమ్రింగుతున్నాడు. ఆలోచనలతో అతని తల వేడెక్కిపోయింది. పద్మముఖి శత్రువుల చేతుల్లో చిక్కుకుందని దృఢంగా నిశ్చయించు కున్నాడు. అందుకు కారకులైన వారిని పట్టుకుని చిత్రవధ చేయాలనుకున్నాడు. అక్కడున్న సిపాయిలను జాగ్రత్తగా ఉండమని హెచ్చరించి వెనక్కి తిరిగాడు.

మహారాజును అనుసరిస్తూ వెళ్ళిన జితేంద్రుడు కూడా గుహలో ఉన్న రాగమణిని, సుమతిని చూశాడు. వారికి ప్రక్కనే తినుబండారాల పళ్ళెం ఉంది. ఆ పళ్ళెంలో

ఉన్న పదార్థాలను వారు తాకనైనా తాకలేదని అతను తెలుసుకున్నాడు. అతను అక్కడున్న సిపాయిలను లెక్కించాడు. ఇరవైమందికి పైగా ఉన్నారు. 'రాగమణిని, సుమతిని ఎలా విడిపించాలి? ఇప్పుడేమి చేయాలి...?' అని అతను ఆలోచిస్తూండగా మహారాజు సైనికులను హెచ్చరించడం విన్నాడు. అంతటితో ఆలోచనలు కట్టిపెట్టి ఆ ప్రాంతంలో ఎక్కడైనా దాక్కోడానికి వీలుగా ఉంటుందేమో అని అటు ఇటు చూశాడు. కాని, అతనికి అలాంటి అవకాశం ఏమీ కనిపించ లేదు. ఇక అక్కడ ఉంటే ప్రమాదమని గుర్తించి, మహారాజు కంటే ముందే బయలుదేరి లోయ బయటకు వచ్చాడు. అతను అరణ్యంలోకి చొరబడి ఒక రాయిమీద కూర్చుని ఆలోచించడం మొదలుపెట్టాడు. 'ఆ గుహ దగ్గర అంతమంది సైనికులతో ఒంటరిగా పోరాడి జయించడం అసాధ్యం. అక్కడకు వెళ్ళడానికి కూడా ఈ లోయ తప్ప మరో మార్గం లేదు. సాహసించి రాజకుమారిని విడిపించడానికి ఎలాంటి ప్రయత్నం చేయకూడదు. దురదృష్టవశాత్తు ప్రయత్నంలో పరాజయం కలిగి రహస్యం వెల్లడైతే, రాగమణిని ఇక్కడ నుంచి మరొక ప్రాంతానికి తీసుకుపోతారు. అప్పుడు చాలా కష్టనష్టాలకు గురి కావలసి ఉంటుంది. ఏదో విధంగా రాజకుమారిని ఇక్కడనుండే విడిపించుకుని తీసుకుపోవాలి. అందుకు కావలసిన ఏర్పాట్లు చేసుకుని కార్యరంగంలోకి దిగాలి. ఈ సంగతి రాజకుమారునితో చెప్పి రణధీర్‌ని వెంటబెట్టుకుని వస్తే, సైనికుల కట్టడిలోంచి రాజకుమారిని, సుమతిని సులువుగా విడిపించడానికి వీలు అవుతుంది!' అనుకున్నాడు.

అతను వెంటనే బయలుదేరి మరుచటి రోజుకు యుద్ధభూమిని చేరుకున్నాడు. తొందరగా రాజకుమారుని గుడారంలో ప్రవేశించాడు.

రాజకుమారుడు గుణసాగర్ సైనికాధికారులనందరను రప్పించి, వారితో ప్రసంగిస్తున్నాడు. పరాజితుడైన ప్రతాప సింహుడు మరల యుద్ధానికి తలపడితే ఏ పద్ధతిలో అతనితో పోరాడ వలసిందీ, ఏ ఏ వ్యూహాలు పన్నవలసిందీ వివరించి చెపుతున్నాడు.

రాజకుమారునికి ఒక వైపున సైన్యాధిపతి ఆదిత్యుడు, మరొక వైపున రణధీర్ కూర్చుని ఉన్నారు.

గుణసాగర్ జితేంద్రుడ్ని చూడగానే సమావేశాన్ని ముగించాడు. సైనికాధికారులందరూ రాజకుమారునికి నమస్కరించి గుడారంలోంచి వెళ్ళిపోయారు.

రాజకుమారుడు గుణసాగర్, ఆదిత్యుడు, రణధీర్, జితేంద్రుడు గుడారంలోనే ఉండిపోయారు.

'జితేంద్రా! ప్రతాపసింహుడు ఓడిపోయి పారిపోయాడు!' అని అంతలోనే ఆందోళనతో 'రాజకుమారి జాడ తెలిసిందా?' అన్నాడు గుణసాగర్.

జితేంద్రుడు తను బయలుదేరింది మొదలు తిరిగి రాజకుమారుని చేరుకునే వరకు జరిగిన విషయమంతా చెప్పి 'సాగర్! రణధీర్‌ని నాతో పంపించండి. రెండు రోజులలో రాజకుమారిని తెచ్చి మీ ఎదుట ఉంచుతాను,' అన్నాడు.

'జితేంద్రా! నీ మాటలు నన్ను చాలా కలవరపరుస్తున్నాయి. నేను కూడా మీతో వస్తాను,' అన్నాడు గుణసాగర్ ఆందోళనగా.

'రాజకుమారా! అలా చేయడం మంచిది కాదు. సైన్యం ఎంత ఉన్నా సమర్థుడైన నాయకుడు లేకపోతే విజయం పొందడం కష్టం! మీరు ఇక్కడే ఉండండి,' అన్నాడు ఆదిత్యుడు వినయంగా.

'ఆదిత్యా! నీ సమర్థత నాకు తెలుసు. సర్వాధికారాలు నీకే ఇస్తున్నాను. నేను తిరిగి వచ్చే వరకు ఈ సేనకంతకూ నువ్వే నాయకుడవు!' అన్నాడు గుణసాగర్.

గుణసాగర్ మాటకు ఎవ్వరూ అడ్డు చెప్పలేకపోయారు. అతను ఆదిత్యునకు కావలసిన సలహాలనిచ్చి, జితేంద్ర, రణధీరులతో కలసి ప్రచండదుర్గం వైపు బయలుదేరాడు.

ముగ్గురూ అరణ్య మార్గాన్ని కొంత దూరం వెళ్ళేసరికి 'రాజకుమారా! నమస్కారం!' అంటూ శంకరదాసు ఎదురయ్యాడు.

శంకరదాసుని చూడ్డంతోనే గుణసాగర్‌కి రణధీర్ చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. రాజకుమారిని శంకరదాసే అపహరించాడని రణధీర్ అన్న మాట జ్ఞప్తికి రావడంతో అతను ఆవేశంతో కత్తి దూసి శంకరదాసు తల నరకడానికి సిద్ధపడ్డాడు.

కాని, జితేంద్రుడు అడ్డుపడి 'సాగర్! ఆవేశపడి న్యాయాన్ని మరుస్తున్నారు. శంకరదాసుని వధించడం ధర్మం కాదు. అతను తన మహారాజు ఆజ్ఞ ప్రకారం రాజకుమారిని అపహరించాడు. అది అతని కర్తవ్యం. అతన్ని దండించడం న్యాయం కాదు,' అన్నాడు.

రాజకుమారుడు కత్తిని ఒరలో దూర్చాడు. 'శంకరదాస్! ఆవేశంలో తొందరపడ్డాను. ఇందులో నీ పొరపాటు ఏమీ లేదు. వెళ్ళు,' అన్నాడు.

శంకరదాసు బాగా దూరమయ్యాక 'సాగర్! శంకరదాసు మనల్ని వెంటాడక మానడు. ఇక మనం అరణ్య మార్గాన్ని విడిచిపెట్టి బహిరంగ ప్రదేశంలోంచి వెళ్ళాలి. అలా చేస్తే అతను మనల్ని అనుసరించడానికి వీలుండదు,' అన్నాడు జితేంద్రుడు.

రాత్రంతా ప్రయాణం చేసి తెల్లవారేటప్పటికి ముగ్గురూ రాజకుమారిని బంధించిన గుహను చేరుకున్నారు. అక్కడ కనబడిన దృశ్యం చూసి అందరూ స్తంభించిపోయారు. పహారా సిపాయిల శవాలు నేల మీద పడి ఉన్నాయి. కొన్ని శవాలు కాళ్ళు తెగి పడి ఉంటే, మరి కొన్ని శవాలకు చేతులు లేకుండా పోయాయి. మూడు శవాలకు మొండేములనుంచి తలలే వేరయ్యాయి!

ముగ్గురూ ఆత్రుతగా గుహలో చొరబడ్డారు. రాగమణి సుమతి అక్కడ కనబడలేదు. కాని, వారు ధరించిన ఆభరణాలు మాత్రం ముక్కలు ముక్కలై చెల్లాచెదరుగా పడి ఉన్నాయి. ఆ గుహంతా రక్తంతో తడిసిపోయి భయంకరంగా కనబడుతూంది.

గుణసాగర్ దుఃఖానికి అంతులేకపోయింది. 'రాగమణీ! నిన్ను దక్కించుకోలేకపోయాను. నా శ్రమంతా వృధా అయింది. ఇక నేనెవరి కోసం బ్రతకాలి?...' అని కుమిలి పోతున్నాడు.

జితేంద్రుడు, రణధీర్ రాజకుమారుని దుఃఖం చూసి సహించలేకపోతున్నారు.

'సాగర్! కలత పడకండి. రాజకుమారి మరణించలేదు. అలానే జరిగితే, ఆమె శవం కూడా ఇక్కడే పడి ఉండాలి,' అన్నాడు జితేంద్రుడు.

'ఇదంతా శంకరదాసు కుట్ర కాదు కదా?' అన్నాడు రణధీర్ ఆలోచిస్తూ.

'కాదు. అతనే రాజకుమారిని, సుమతిని ఇక్కడనుంచి తొలగించడానికి పూనుకుంటే ఈ సిపాయిలు మరణించవలసిన అవసరమేముంది? సాగర్! ఆలోచిస్తే అంతా తెలుస్తుంది.

ముందు మనం ఈ లోయలోంచి బయటకు పోవాలి. ఇక్కడ ఆలస్యం చేయడం మంచిది కాదు,' అన్నాడు జితేంద్రుడు.

ముగ్గురూ నెమ్మదిగా లోయలోంచి ఇవతలకు వచ్చి అరణ్యంలో ప్రవేశించారు.

గుణసాగర్ విచారంగా ఒక రాయి మీద కూర్చుని ఉన్నాడు. జితేంద్రుడు, రణధీరూ అతనికి అనేక విధాల ధైర్యం చెపుతూ రాగమణి బ్రతికి ఉందనే నమ్మకం కలిగించడానికి తాపత్రయపడుతున్నారు.

అంతలో ఒక రాయి వచ్చి రాజకుమారుని ముందు పడింది. అందరూ అనుమానాశ్చర్యాలతో రాయి వచ్చిన వైపు చూశారు. అదే సమయంలో ఇంకొక వైపునుంచి మరొక రాయి వచ్చి పడింది. అలా చాలా రాళ్ళు పడుతున్నాయి.

దట్టంగా ఉన్న ఆ అడవిలోంచి రాళ్లు ఎలా వస్తున్నాయో, ఎవరు విసురుతున్నారో తెలియక కాసేపు ముగ్గురూ తికమకలు పడ్డారు. చివరకు ఆ రాళ్ళు విసురుతున్నవాళ్ళను పట్టుకోవాలనుకున్నాడు జితేంద్రుడు. గుణసాగర్‌ని అక్కడే కూర్చుండమని చెప్పి నెమ్మదిగా జితేంద్రుడు ఒక వైపుకు, రణధీర్ ఒక వైపుకు వెళ్ళి చెట్టు చెట్టుకూ గాలించడం మొదలు పెట్టారు.

బాగా అలసట కలిగే వరకూ వెదికినా వారికి ఎవ్వరూ కనబడలేదు. చివరకు విసుగెత్తి ఇద్దరూ రాజకుమారుడు కూర్చున్న రాయి దగ్గరకు వచ్చారు. రాయి మీద రాజకుమారుడు లేడు! ఎలుగెత్తి పిలిచారు. అయినా సమాధానం రాలేదు!

'రణధీర్! మోసపోయాము. సాగర్‌ని శత్రువులు బంధించి తీసుకు పోయారనడంలో సందేహం లేదు. మనం తొందరగా ప్రచండ దుర్గం చేరుకోవాలి. బహుశా రాజకుమారుడ్ని అక్క-

డికే తీసుకు పోతారు,' అని జితేంద్రుడు రణధీర్‌తో ప్రచండ దుర్గం వైపు బయలుదేరాడు.

ఇద్దరూ కోటను సమీపించారు. శంకరదాసు అప్పుడే కోటలో ప్రవేశిస్తున్నాడు. నజీరుద్దీన్ భుజం మీద మూట పెట్టుకొని అతని వెనకాల వెడుతున్నాడు. జితేంద్రుడు ఆ ఇద్దరినీ బాగా గుర్తుపట్టాడు. 'రణధీర్! చూడు, నా అనుమానం నిజమైంది. శంకరదాసు, నజీరుద్దీను కలిసి ఈ పని చేశారు. రాజకుమారుడ్ని మనం ఈ రాత్రే విడిపించుకు పోవాలి. అందుకు తగిన ఆలోచన చెబుతాను, రా!' అంటూ అతను రణధీర్‌ని తీసుకుని మరో వైపుకు వెళ్ళిపోయాడు.

## 35

మహారాజా ప్రతాపసింహుని భవనానికి చేరి ఉన్న ఒక చీకటి గదిలో రాజకుమారుడు గుణసాగర్ బంధించబడి ఉన్నాడు. అతని చేతులకు బేడీలు వేసి, కాళ్ళకు సంకెళ్ళు తగిలించారు. ఆ గదికి ఒకే గుమ్మం ఉంది. గుమ్మానికి ఉన్న ఇనుప ఊచల తలుపుకు బయట తాళం వేసి ఉంది.

గుణసాగర్ విచారంగా తలుపుకు ఆనుకుని నిలబడ్డాడు. అతనికి ఎదురుగా మైనపు ఒత్తుల వెలుతురులో మెరిసిపోతున్న రత్నకంబళి పరచి ఉంది. దానికి కొంచెం దూరంలో అందమైన వేదిక అమర్చి ఉంది. అంతకు ముందే జరిగిన ఆ ఏర్పాట్లు ఎందుకో అర్థం కాక అతను ఆలోచనలో పడ్డాడు.

రాజకుమారుని ఆలోచనలు అంతరించక ముందే మహారాజా ప్రతాపసింహుడు అక్కడకు వచ్చాడు. అతనికి ఒక వైపు రాజకుమారి రాగమణి, రెండవ వైపు సుమతి ఉన్నారు.

గుణసాగర్ అనుమానాశ్చర్యాలతో ఆ ముగ్గురినీ నిదానించి చూస్తున్నాడు. అంతలో ప్రతాపసింహుడు ముందుకు

వచ్చాడు. 'సాగర్! రాగమణి నిన్నే ప్రేమిస్తుందని మురిసి పోయావు. ఆమె కోసం చాలా శ్రమపడ్డావు. చివరకు నీ ప్రాణాలు ఇవ్వడానికి కూడా సిద్ధపడ్డావు. కాని, ఇపుడే మయిందో చూశావా! ఆమె నన్నే వరించి నా ప్రక్కకు చేరింది. సుమతి కూడా అంతే!' అని రాగమణి బుగ్గ మీద చిన్న దెబ్బ వేశాడు మహారాజు.

రాగమణి చిరునవ్వుతో మహారాజుకు సమాధానం చెప్పి రాజకుమారుని వైపు కొంటెగా చూసింది. సుమతి కూడా రాజకుమారునియందున్న గౌరవ మర్యాదలను విడచి అతన్ని అతి చులకనగా చూడసాగింది.

ఆ ఇద్దరి చూపుల్లో ఉన్న నిర్లక్ష్యం చూడగానే గుణ సాగర్ గుండె మండిపోయింది. తనదనుకున్న రాగమణి-తననే ప్రేమిస్తున్నానని నమ్మించిన రాకుమారి - తన ఎదుట మహారాజు నడుం చుట్టూ చెయ్యి వేసి, తన వంక చూసిన ఆ చూపు అతన్ని పిచ్చివాడ్ని చేసి విడిచిపెట్టింది. ఆవేశంతో కంపించిపోతున్న గుణసాగర్ మానవత్వాన్నే మరచి పోయాడు. అతనిలో పశుబలం తలెత్తింది.

అతను ఒక్కసారిగా తన చేతుల్ని తలుపులకు వేసి కొట్టాడు. బేడీలు ముక్కలై నేల మీద పడిపోయాయి. ఒక్క విదలింపుతో కాళ్ళకున్న సంకెళ్ళు తెగి దూరంగా పోయి పడ్డాయి. సాగర్ కాలు బలంగా తలుపు మీద పడింది. ఇనుప ఊచల ఉక్కు తలుపు దడదడలాడుతూ విడిపోయింది.

రెప్పపాటు కాలంలో సాగర్ ప్రతాపసింహుని ముందు నిలబడి అతని మొలలో ఉన్న కత్తిని పైకి లాగాడు. ఒక్క వేటుతో రాగమణి తల తెగి నేల మీద పడేలా నరికాడు. రెండవసారి లేచిన కత్తి సుమతి మొండెంనుంచి తలను వేరు చేసింది.

ఊహించని బలం చూపించి, అకస్మాత్తుగా బయటపడిన సాగర్ పరాక్రమం చూడగానే మహారాజు ప్రతాపసింహుడు అదిరిపడ్డాడు. అతనిలోని చైతన్యం నశించింది. తెలివి మంద గించింది. ధైర్య సాహసాలు మరుగుపడ్డాయి. అతను రాజ కుమారుడు గుణసాగర్ ముందు రాతి ప్రతిమలా నిలబడి పోయాడు.

అదే సమయంలో జితేంద్రుడు, రణధీరు అక్కడకు చేరు కున్నారు. 'శహబాస్! రాజకుమారా చక్కని పని చేశారు,' అంటూనే జితేంద్రుడు మహారాజు మెడ మీదకు త్రాడు విసరి బిగించాడు.

అప్పటికే అయోమయంలో మునిగిపోయిన మహారాజు త్రాడు బిగియగానే ఊపిరి ఆడక తెలివి తప్పి నేల మీద పడి పోయాడు. వెంటనే మహారాజును సంచిలో వేసి మూట కట్టి భుజం మీద వేసుకున్నాడు రణధీర్.

'సాగర్! నాతో రండి. ఇక్కడ మాట్లాడ్డానికి కొంచెం కూడా సమయం లేదు,' అని జితేంద్రుడు రాజకుమారుని చెయ్యి పట్టుకుని నడిపించుకు పోసాగాడు.

ఆ సమయంలో దాసీలు తప్ప అక్కడ ఒక్క సైనికుడు కూడా లేడు. అక్కడున్న వాళ్ళలో చాలామంది దాసీలు గుణసాగర్ చేసిన పని చూడలేక తెలివి తప్పి పడిపోయారు. మిగిలినవాళ్ళు ఒక్క పలుకు కూడా పలుక లేదు; కళ్ళు అప్ప గించి అలానే చూస్తూ ఉండిపోయారు.

## 36

రణధీర్ ప్రతాపసింహుణ్ని కట్టిన మూట భుజం మీద పెట్టు కుని ముందు నడుస్తున్నాడు. అతని వెనకాల రాజకుమా రుడు వెడుతున్నాడు. జితేంద్రుడు రాజకుమారునికి దగ్గర

దగ్గరగా నడుస్తున్నాడు. కాని, రాజకుమారుడి పరిస్థితి చూసి అతన్ని కొంతసేపటి వరకు పలకరించకూడదనుకున్నాడు. రాగమణి మరణం గుణసాగర్‌ని ఎంత దుఃఖంలో ముంచుతుందో ఊహించి కంపించిపోయాడు జితేంద్రుడు.

రాగమణిని, సుమతిని ఆవేశంతో చంపినప్పటినుంచి గుణసాగర్ ఒక్క పలుకు పలకలేదు. అతని ముఖంలో విచారంగాని, దుఃఖంగాని కొంచెం కూడా కనబడ్డం లేదు. అంతేకాదు; అతనిలోని వివేకమే తొలగిపోయింది. అతని స్థితి పూర్తిగా మారిపోయింది. మొదట ఉన్న ఆలోచనలన్నీ అంతరించాయి. పూర్వ జ్ఞానం నశించింది. రాగమణియందున్న ప్రేమ, జితేంద్రునితో ఉన్న స్నేహం, ప్రతాపసింహుని మీదున్న పగ - అన్నీ మరచిపోయాడు గుణసాగర్. అతను ఎక్కడకు వెడుతున్నాడో, ఎందుకు వెడుతున్నాడో, ఎవరితో వెడుతున్నాడో కూడా తెలియని స్థితిలో మంత్రముగ్ధునిలా నడచి పోతున్నాడు.

తెల్లవారేటప్పటికి ముగ్గురూ ప్రచండ దుర్గానికి చాలా దూరంగా వెళ్ళిపోయి దట్టమైన అడవిలో ప్రవేశించారు. కొంత దూరం వెళ్ళాక 'రణధీర్! ఇక్కడ కాసేపు ఆగుదాం!' అన్నాడు జితేంద్రుడు.

రణధీర్ మూట క్రింద పెట్టి అక్కడున్న ఒక రాతిని శుభ్రపరచి 'రాజకుమారా! ఈ రాతి మీద కూర్చోండి,' అన్నాడు. కాని, గుణసాగర్ అలానే నిలబడి నేల మీదకు చూస్తూ ఉండిపోయాడు.

గుణసాగర్ స్థితిని చూసి జితేంద్రుడు చాలా కంగారు పడ్డాడు. అతను సాగర్ ముఖంలోకి నిదానించి చూసి గుండె బాదుకున్నాడు. 'ఏమిటీ దారుణం! పీడ ముఖం పడిపోయింది. రెప్పలు వాలడం లేదు. చూపు నేలమీద పడి ఒక్క

చోటనే నిలచిపోయింది. గాజు కళ్ళు పడ్డాయి. ఎందుకిలా జరిగింది? రాగమణి చూపుతోపాటే సాగర్ జీవితం కూడా అంతమైపోయిందా? అలానే జరిగితే ఇంకా నిలబడి ఎలా ఉంటారు? ఛి... ఛి... మనసులోకి ఊహించరాని ఆలోచనలు వస్తున్నాయి. దుఃఖభారంతో ఆయన మనస్సు ఎక్కడో విహరిస్తూంది. అందుకే అలా కొయ్యబారి నిలుచుండిపోయారు. నెమ్మదిగా కూర్చుండబెట్టి ఉపచర్యలు చేస్తే తప్పకుండా తెలివి కలుగుతుంది!' అని లోలోపల అనుకుని, జితేంద్రుడు సాగర్ చెయ్యి పట్టుకుని కూర్చుండబెట్టాలనుకున్నాడు. కాని, ఫలితం వేరైంది. అప్పటివరకు నిలబడి ఉన్న గుణసాగర్ జితేంద్రుని చెయ్యి తగలగానే. మొదలు నరికిన చెట్టులా నేల మీద పడిపోయాడు. అతని తల రాయిమీద పడి చిట్లింది. గాయంలోంచి రక్తం ధార కట్టి ప్రవహించసాగింది. అయినా అతనిలో ఏమీ మార్పు రాలేదు. రెప్పలు నిలచిపోయాయి. చూపులో చలనం లేకుండాపోయింది. శ్వాస ఆగాగి వస్తూంది.

జితేంద్రునికి ఉన్న ఆశ కూడా తొలగిపోయింది. రాజకుమారుడు బ్రతుకుతాడనే నమ్మకం నశించింది. ప్రాణమిత్రుడు తనకు దూరమైపోతున్నాడన్న దుఃఖంతో అతను 'సాగర్! సాగర్!' అని గొంతెత్తి పిలుస్తూ పర్వతాలు ప్రతిధ్వనించేలా ఏడవడం మొదలు పెట్టాడు. మధ్య మధ్య 'సాగర్! నిజంగా నువ్వీ ప్రపంచాన్ని విడిచిపెట్టావా! రాగమణియందున్న నీ ప్రేమే నిన్ని లోకానికి దూరం చేసింది. ఆమె రూపం నీ హృదయంలోకి వచ్చిన సమయమే మంచిది కాదు; అందుకే ఇలాంటి దుష్ఫలితం కలిగింది; ఇంత అల్పాయుష్షులో నీకు మరణాన్ని కలిగించింది!' అంటూ వాపోతున్నాడు.

అంతలో ఒక వైపు నుంచి 'రాజకుమారుని చంపగలిగిన వాళ్ళు ఇంకా ఎవరూ పుట్టలేదు. దేవుడు అతనికి పూర్ణా

యుష్షు వ్రాశాడు. రాగమణి ప్రేమ చాలా పవిత్రమైంది. దాని ఫలితం కూడా ఎంతో మంచిదౌతుంది. గుణసాగర్ తప్పకుండా రాగమణిని వివాహం చేసుకుంటాడు. ప్రచండ దుర్గానికి రాజకుమారుడే అధిపతి ఔతాడు. ఇంకా ఎన్నో రాజ్యాలను జయించి గొప్ప కీర్తిని పొందుతాడు. వృథాగా ఎందుకలా ఏడుస్తారు?' అని వినబడింది.

జితేంద్రుడు, రణధీర్ దుఃఖాన్ని దిగమ్రింగి అటు ఇటు చూశారు. కాని, ఎవరూ కనబడలేదు. ఇద్దరూ అనుమానంతో చుట్టూ వెదక దలుచుకుని లేచి నిలబడ్డారు. అంతలో 'ఇలా చూడండి!' అని మళ్ళీ వినబడింది. జితేంద్రుడు ఆ శబ్దం వచ్చిన వైపు తలెత్తి చూశాడు. సద్గుణ తంత్రవేత్త చెట్టు మీంచి క్రిందకి దిగుతూ కనిపించాడు. జితేంద్రుడు అతని వైపే చూస్తూ ఉండిపోయాడు.

సద్గుణ తంత్రవేత్త జితేంద్రుని ముందుకు వచ్చాడు. 'జితేంద్రా! ఇప్పుడు మీరు విన్న మాటలన్నీ నేనే అన్నాను. భవిష్యత్తులో అంతే జరుగుతుంది. అందులో ఏమీ సందేహం లేదు. మీకు నేను శత్రువుననే సంగతి మరచిపో. మిత్రుడ్నిగా భావించు. ముందు రాజకుమారునికి ఉపశాంతి చేయాలి!' అని ఆ అడవి మొక్కల్లో ఒకదాన్ని లాగి తెచ్చాడు. ముకోణపు ఆకులు, నీలిరంగు పూలు ఉన్న ఆ మొక్కను చేతితో మెత్తగా నలిపి, దాని పసరును రాజకుమారుని కళ్ళల్లోను, ముక్కుల్లోను పిండి, మిగిలిదాన్ని తలకు తగిలిన గాయం మీద వేసి కట్టాడు.

అర్ధ ఘడియ గడవక ముందే సాగర్‌లో చలనం కలిగింది. కళ్ళల్లో కాంతి చేరింది. అవయవాలు కదలసాగాయి. రెండు మూడు తుమ్ములు కూడా వచ్చాయి. దానితో సాగర్‌కి పూర్తిగా తెలివి కలిగింది. అతను లేచి కూర్చున్నాడు. చుట్టూ

ఉన్న ప్రదేశాన్ని, అక్కడ ఉన్న వాళ్ళను చూసి 'ఏమి జరి గింది?' అన్నాడు. జితేంద్రుడు విషయమంతా వివరంగా చెప్పాడు. సాగర్ చేతులు జోడించి సద్గుణ తంత్రవేత్తకు నమస్కరించి 'ఆచార్యా! నా మీద మీకింత దయ ఎందుకు కలిగింది? ఈ విషయం ప్రతాపసింహునికి తెలిస్తే, మిమ్మల్ని తప్పక దండిస్తాడు,' అన్నాడు.

'రాజకుమారా! నాకా భయం లేదు. నేనిపుడు మహా రాజా ప్రతాపసింహుని ఆధీనంలో లేను. ఆయన కొంత కాలంనుంచి ధర్మాన్ని విడిచిపెట్టి అన్యాయ మార్గాన్ని నడు స్తున్నారు. అట్టివారికి నేను సేవ చేయలేను. చాలాకాలం నుంచి మీతో కలవాలని కోరికగా ఉంది. కారణం లేకుండా మహారాజును విడిచిపెట్టడం ధర్మం కాదు కనుక ఇంత కాలం ఆయనతో ఉన్నాను. తారతమ్యం తెలుసుకోనక నన్ను ఆయన అవమానపరచారు. అప్పటినుంచి మీతో కలవడానికి తగిన సమయం కోసం చూస్తున్నాను. ఈనాటికి లభించింది. మీకు జీవం పోసి మీ గూఢచారులు నన్ను ఇక సందేహించడానికి వీలులేని పని చేశాను. ఇంతటినుంచి నన్నుకూడా మీ గూఢ చారిగా చేసుకో వలసిందిగా ప్రార్థిస్తున్నాను,' అన్నాడు సద్గుణ తంత్రవేత్త.

రాజకుమారుడు జితేంద్రుని వైపు చూశాడు. ఆ చూపులో ఉన్న భావాన్ని తెలుసుకున్న జితేంద్రుడు 'సద్గుణాచార్యా! మహారాజా మిమ్మల్ని ఎందుకు అవమానించారు?' అని అడిగాడు.

'ముఖ్య విషయాల్లో మహారాజా నన్ను సలహా అడగడం పరిపాటి. కాని, నా అభిప్రాయం ఆయనకు ఎప్పుడూ అను కూలంగా ఉండేది కాదు. ఆయన ఉద్దేశం ప్రకారమే కార్య రంగంలోకి దిగి, దుష్ఫలితాన్ని పొందాక పశ్చాత్తాప పడే

వారు. గడచిన రాత్రి కూడా నా సలహాకు వ్యతిరేకంగా ప్రవర్తించారు. దాని ఫలితంగా నిత్యానందం, పరమానందం- ఈ లోకానికి దూరమయ్యారు. గౌరవం లేని కొలువులో పని చేసేకంటే యాచన చేసుకుని బ్రతకడం మంచిది. నన్ను నమ్మి మీ దగ్గర స్థానం ఇస్తే చాలా ఆనందిస్తాను,' అన్నాడు సద్గుణ తంత్రవేత్త.

'సద్గుణాచార్యా! మీ స్నేహాన్ని సంతోషంగా స్వీక రిస్తాను. సాగర్ మిమ్మల్ని తప్పక గౌరవిస్తాడు. ఇప్పుడు చెప్పండి! నిత్యానందం, పరమానందం ఎందుకు మరణించారు?' అన్నాడు జితేంద్రుడు.

గూఢచారుల నియమాన్ననుసరించి ప్రమాణాలు చేసుకున్న తర్వాత తంత్రవేత్త యిలా చెప్పాడు: 'రాజకుమారిని వెదక డానికి మీరు .ఇక్కడకు వస్తూండగా శంకరదాసు దారిలో మిమ్మల్ని చూశాడు. మీకంటె ముందు రాగమణి ఉన్న ప్రాంతానికి వెళ్ళి ఆమెను అక్కడనుండి మరొక చోటకు తీసుకుపోయి దాచాలనుకున్నాడు. కాని, అతనక్కడకు చేరక ముందే రాజకుమారి అక్కడనుండి మాయమైపోయింది. ఆమె పారిపోయినా, మిమ్మల్ని బంధించాలనే తలంపుతో అతను నజీ రుద్దీన్‌ని సహాయంగా తీసుకుని మీ కోసం వెదకడం మొదలు పెట్టాడు. చివరకు మిమ్మల్ని మోసం చేసి రాజకుమారుడ్ని బంధించి తీసుకుపోయాడు,' అని గుణసాగర్ వైపు చూశాడు.

. 'సాగర్! జితేంద్రుడు రాళ్ళు విసరేవాళ్ళను పట్టుకోడానికి వెళ్ళగానే, జితేంద్రుని వేషంలో ఉన్న శంకరదాసు మీ దగ్గ రకు వచ్చి మీకు తెలివి తప్పించి తీసుకుపోయాడు. తర్వాత, రాగమణియందు మీకు విరక్తి కలగడానికి, ఫలితంగా ప్రతాపసింహుడు మీతో పోరాడ వలసిన అవసరం లేకుండా ఉండడానికి ఒక ఎత్తు వేశారు. దాని ఫలితంగా రాగమణిలా

అడవిలోనే ఎక్కడో తిరుగుతూ ఉంటుంది. ప్రతాప సింహుని గూఢచారులు కూడా ఆమె కోసం ఇంకా గాలిస్తూనే ఉంటారు. రాగమణి ఈసారి కనుక వాళ్ళకు చిక్కితే ఊహించరాని ప్రమాదం సంభవిస్తుంది. ఆమెకు ఏ ఆపదా రాకుండా ఉండాలంటే రాజకుమారుడు నాతో ఉండడం అవసరం!' అన్నాడు తంత్రవేత్త.

జితేంద్రుడు తంత్రవేత్త సలహాలను పాటించి మహారాజు ఉన్న మూట భుజంమీద పెట్టుకుని నడవసాగాడు. రణధీర్ రెండవ మూటతో జితేంద్రుడ్ని అనుసరించాడు.

## 37

రాజకుమారి రాగమణి, సుమతి వాగు ప్రక్కనున్న పెద్ద రాతి పలకమీద కూర్చున్నారు. ఇద్దరి ముఖాల్లోను దీనత్వం అలుముకుంది. బట్టలు బాగా మాసిపోయాయి. శరీరాలు దుమ్ముతో నిండిపోయాయి. వారికి ప్రక్కగా రెండు విల్లులు, కొన్ని అమ్ములు పడి ఉన్నాయి. చుట్టూ ఉన్న దట్టమైన అడవిలోంచి అప్పుడప్పుడు వినబడుతూన్న క్రూర మృగాల అరపులు వారి హృదయాలను కంపింప చేస్తున్నాయి. అలాంటప్పుడు ఇద్దరూ ఒకరి కొకరు దగ్గరగా జరుగుతున్నారు. భయాందోళనలతో ఒకరి నొకరు చూచుకుంటున్నారు.

కొంతసేపటికి రాగమణి సుమతిని చూసి 'సుమతీ! మనం ఇప్పుడెక్కడ ఉన్నాం? సుందరగడం ఎంత దూరం ఉంటుంది? మన దేశం చేరడానికి ఉపాయమేమిటి?' అంది.

'సైనికుల బారినుండి తప్పించుకుని పారిపోయే సమయంలో నేను బుద్ధిపూర్వకంగా మనదేశం వెళ్లే మార్గాన్ని విడిచి పెట్టాను. ప్రతాపసింహుని సైనికులు ఆ మార్గంలో గుడారాలు వేసుకుని ఉండడమే అందుకు కారణం. అంతలోనే

రాక్షసుల్లాగ దుర్ముఖి, నజీరుద్దీన్, మహమ్మదాలీ - మనల్ని వెంటాడ్డం మొదలుపెట్టారు. వాళ్ళకు చిక్కకుండా తప్పించుకోవడంలో పూర్తిగా దిక్కులను మరచి పరుగెత్తాను. చివరకు ఇక్కడకు చేరుకున్నాం. దుర్మార్గుల చేతిలోంచి తప్పించుకున్నామంటే, ఇప్పుడు దుష్ట మృగాల మధ్య చిక్కుకున్నాం. ఏమిచేయడానికీ తోచడంలేదు. ఇంటికి ఎప్పటికి చేరుకుంటామో తెలియడం లేదు,' అంది సుమతి ఆలోచిస్తూ.

రాజకుమారికి సైనికులతో పోరాడి తప్పించుకున్న దృశ్యం జ్ఞాపకం వచ్చింది. ఆమె సుమతి భుజం మీద చెయ్యి వేసి 'సుమతీ! ఆ సైనికులతో పోరాడుతూండగా బల్లెం తలకు తగిలి నువ్వు క్రింద పడిపోయినపుడు నేను చాలా కంగారు పడ్డాను. కాని, నువ్వు అంతలోనే పైకి లేచి ఆ సైనికుని చెయ్యి తెగి పడేలా నరికినపుడు నేను పోరాడ్డం మాని ఆశ్చర్యంగా నిన్నే చూస్తూ ఉండిపోయాను,' అంది.

'రాజకుమారీ! మనం ఆడవాళ్ళమని ఆ సైనికులు నిర్లక్ష్యంగా ఉన్నందువల్లే మనకు విమోచన కలిగింది. సాహసంగా మీరు సైనికుని మొలనుండి కత్తిని లాగి వాళ్ళతో పోరాడుతున్నప్పుడు కొంతసేపటి వరకు నేను ఆశ్చర్యంగా మిమ్మల్నే చూస్తూ ఉండిపోయాను. మీరు హెచ్చరించే వరకు పోరాడాలన్న తలంపే కలగలేదు. తర్వాత కత్తి పట్టుకుని మీకు సహాయంగా నిలచాను,' అంది సుమతి.

'సహాయంగా నిలబడ్డాననేకంటే ఆ సిపాయి అదుపులోంచి విడిపించానంటే బాగుంటుంది. నువ్వు ఆ సమయంలో అలా విజృంభించి పోరాడక పోతే మనకు విముక్తి లభించదు. పోరాడ్డంలో ఆడ, మగ భేదం లేదని ఋజువు చేస్తూ ఆ సైనికుల నందరినీ వధించావు. కోటకు చేరాక మహారాజుతో చెప్పి నీకు మంచి బహుమతి ఇప్పిస్తాను,' అంది రాగమణి.

రాగమణి అలా అంటూండగా వాగులోంచి గుడగుడ శబ్దం వినబడసాగింది. ఇద్దరూ అటు చూసి భయంతో ఒణికి పోయారు. పులి నీరు త్రాగుతూండగా వస్తున్న శబ్దమది.

'సుమతీ! ఆపదల మీద ఆపదలు వచ్చి పడుతున్నాయి. శత్రువుల చేతిలోంచి తప్పించుకున్నామనుకుంటే ఈ పులికి ఆహారం కావలసి వస్తూంది,' అంది రాగమణి కంపించే గొంతుకతో.

సుమతి రాతిమీదున్న రెండు విల్లుల్నీ పైకి తీసింది. ఒకటి రాగమణికి ఇస్తూ 'రాజకుమారీ! భయపడకండి. పులి ఇంకా మనల్ని చూడలేదు. చూసినా అది ఈదుకుని ఇవతలి ఒడ్డుకు రాక ముందే దాని పని పడతాను. మీరు కూడా బాణం ఎక్కు పెట్టి ఉంచండి,' అంది.

ఇద్దరూ నిశ్శబ్దంగా బాణాలు ఎక్కుపెట్టి పులి వైపే చూస్తున్నారు. పులి నీరు త్రాగి పైకి చూడ్డంతోనే రాగమణి, సుమతి-దాని దృష్టిలో పడ్డారు. పులి వాళ్ళను చూడగానే ఉత్సాహంగా వాగులోకి ఉరికి, ఇవతలి ఒడ్డుకు ఈదడం ప్రారంభించింది.

రాగమణి తమ వైపు ఈదుకు వస్తున్న పులిని చూస్తూ 'సుమతీ! ఇది మనల్ని చంపక మానదు. ఈ బాణాలు పులిని చంపడానికి కొంచెం కూడా పనికిరావు,' అంది ఆందోళనగా.

సుమతి పులిమీంచి దృష్టి మరల్చకుండానే 'రాజకుమారీ! అధైర్యపడవద్దు. ధైర్యం వహించి గురి తప్పకుండా కుడి కంటిని కొట్టండి. నేను ఎడమ కంటికి గురి పెడుతున్నాను. నేను 'సై!' అన్న వెంటనే బాణం విడవండి,' అంది.

వారలా మాట్లాడుకున్నంతలో వాగులో దూకిన పులి ఈవలి ఒడ్డుకు చేరుకుంటూంది. ఒడ్డు ఇంకా రెండు గజాల దూరం ఉంది. పులి చురుగ్గా ఈదుకుంటూ వస్తూంది.

రాగమణి, సుమతి బాణాలను పులి వైపు గురిపెట్టి ఉంచారు. పులి ఒడ్డున కాలు మోపుతూండగా సుమతి 'సై!' అంది. అలా అంటూనే తన చేతిలోని బాణం విడిచింది. రాగమణి కూడా సుమతి చేసిన సూచన వినగానే తను ఎక్కుపెట్టిన బాణాన్ని కూడా వదలింది. ఏమాత్రం వెనక ముందులు లేకుండా ఆ బాణాలు రెండూ పులి కళ్ళల్లోకి లోతుగా చొచ్చుకు పోయాయి. కళ్ళు పోయిన ఆ పులి బాధగా అరచి నీళ్ళలోకి జారిపోయింది. వాగులో మునిగిన పులి శరీరం ఒకటి రెండు సార్లు తేలి నీటి వాలులో కొట్టుకుపోయింది.

అంతటితో దాని పీడ వదలినందుకు సంతోషిస్తూ రాగమణి, సుమతి విల్లమ్ములు క్రింద పడవేసి మామూలుగా రాతి మీద కూర్చున్నారు.

## 38

జితేంద్రుడు, రణధీర్ మాటలను ఎత్తుకుని బయలుదేరిన తర్వాత సద్గుణ తంత్రవేత్త గుణసాగర్‌ని వెంటబెట్టుకుని ఆ యడవిలో నలు వైపులా వెదకసాగాడు. అతనలా చెట్టు చెట్టు చొప్పున వెదుక్కుంటూ తోచిన దారినిబట్టి పోతున్నాడు. గుణసాగర్ ఏమీ మాట్లాడకుండా తంత్రవేత్త వెనకాల వెడుతున్నాడు.

ఇద్దరూ అడవి అంతా చూచుకుంటూ చాలా దూరం వెళ్ళారు. ఎండ మండిపోతూంది. పైన నెత్తి కాలిపోతూంటే, క్రింద కాళ్ళు మాడిపోతూన్నాయి.

వెనక నడుస్తున్న గుణసాగర్ తంత్రవేత్తకు దగ్గరగా వచ్చి 'సద్గుణాచార్యా! ఇంత దట్టమైన అడవిలో రాగమణి ఎక్కడ దొరుకుతుందని వెదుకుతున్నారు? ఆమె ఇలాగే వచ్చిందని నమ్మకమేముంది? సుందరగడం వెళ్ళే మార్గం సుమతికి బాగా

తెలుసును. ఆమె రాగమణిని ఇప్పటికి సుందరగడం చేర్చే ఉంటుంది,' అన్నాడు.

'రాజకుమారా! మీ ఊహ సరైంది కాదు. సుందరగడం వెళ్ళే దారి ప్రతాపసింహుని సైనికులతో నిండిపోయి ఉంది. ఒకవేళ వారు ఆ మార్గాన్నే వెడితే ఈపాటికి తిరిగి బంధించబడి ఉందురు. సుందరగడం వెళ్ళడానికి మరొక మార్గం లేదు. అందుచేత రాజకుమారి, సుమతి కలిసి ఈ అడవిలోనే తిరుగుతూ ఉంటారు. అందులో ఏమీ సందేహం లేదు. వాళ్ళను తొందరగా కలుసుకోనకపోతే అనేక ప్రమాదాలున్నాయి. ఒక వైపు భయంకరమైన క్రూర మృగాలు, మరొక వైపున శత్రు గూఢచారులు-రాజకుమారి హృదయాన్ని చాలా కలవర పెడుతూంటారు. మీరు సంశయించకుండా నాతోపాటు వెదకండి,' అని తంత్రవేత్త చురుగ్గా వెదుకుతూ ముందుకు పోతున్నాడు. గుణసాగర్ కూడా చెట్లు, పుట్టలు, ముళ్ళ పొదలు-వెదుక్కుంటూ తంత్రవేత్త వెనకాల వెడుతున్నాడు.

కొంత దూరం వెళ్ళాక ఇద్దరూ చిన్న నలిగిన బాటలోకి వచ్చారు. తంత్రవేత్త గుణసాగర్ వైపు తిరిగి 'రాజకుమారా! ఈ బాట తిన్నగా ప్రచండ దుర్గం తీసుకు పోతుంది. ఇలా ముందుకు పోతే ఇంకా భయంకరమైన అడవిలో ప్రవేశిస్తాము. మనం ఈ మార్గాన్నే వెళ్ళాలి. క్రూర మృగాల భయం ఎక్కువగా ఉంటుంది. అయినా వెళ్ళక తప్పదు. నాకు సమీపంగానే నడుస్తూండండి.' అన్నాడు.

ఇద్దరూ నడవడం ప్రారంభించారు. అంతలో వారికి కొంత దూరంలో యిద్దరు మనుషులు కనిపించారు. వారు చెట్ల నుంచి తీసిన తేనెను తుట్టి ముంతల్లోకి పిండుతున్నారు. గుణసాగర్ తొందరగా వాళ్ళను చేరుకున్నాడు. దాహం తీర్చు

కోడానికి కొంచెం తేనె అడిగి పుచ్చుకున్నాడు. సగం తేనె తంత్రవేత్తకు ఇచ్చి, మిగిలింది గుణసాగర్ త్రాగాడు.

దాహంతో బాధపడుతున్న తంత్రవేత్తకు ఆ తేనె అమృతంలా కనబడింది. వెంటనే అతను కూడా ఆ తేనె త్రాగి దాహం తీర్చుకున్నాడు.

ఇద్దరూ మళ్ళీ నడక సాగించారు. కాని, నాలుగడుగులు కూడా వేయకుండానే ఇద్దరూ తెలివి తప్పి నేల మీద పడి పోయారు.

అంత వరకు చెట్ల చాటునుంచి అదంతా చూస్తున్న మనుషులు ఇద్దరు బయటకు వచ్చారు. అంతలో వారికి మూడవవాడు తోడయ్యాడు. ముగ్గురూ కలిసి గుణసాగర్‌ని, తంత్రవేత్తను చెరొక చెట్టుకు కట్టి పెట్టి తెలివిని కలిగించారు.

గుణసాగర్ కళ్ళు విప్పి ముగ్గురినీ చూశాడు. వారిలో ఒకతన్ని ఉద్దేశించి 'దుర్ముఖీ! చాలా నీచంగా ప్రవర్తిస్తున్నావు. నీ తండ్రి గౌరవానికి కళంకం తెచ్చావు. దేశానికి దూరమైపోయావు. ఇప్పటికైనా మించిపోయింది లేదు. మహారాజా కీర్తిసేనుని ఎదుట నిలబడి మన్నించమని వేడుకో! నీకు మేలు కలుగుతుంది!' అన్నాడు.

దుర్ముఖి కళ్ళు ఎరుపెక్కాయి. అతని శరీరం క్రోధంతో ఉడికిపోతూంది. రాజకుమారునికి దగ్గరగా వచ్చి 'సాగర్! నువ్వే నీచంగా ప్రవర్తించావు. నేను ప్రేమించిన రాగమణిని వాంఛించావు. ఆమెను నాకు దూరం చేయాలనుకున్నావు. ఇక నీ ఆటలు సాగవు. ఇంతటితో నీ ఆయుష్షు తీరింది. ఈ రోజుతో నీ అడ్డు ఒదిలిపోతుంది,' అన్నాడు దుర్ముఖి.

చెట్టుకు కట్టి ఉన్న సాగర్ శరీరం పొంగిపోతూంది. అతన్ని బంధించిన బలమైన త్రాళ్ళు పట పట లాడుతున్నాయి. పళ్ళు కొరుకుతూ 'దుర్ముఖీ! నువ్వెంత దుర్మార్గుడవో నాకు

తెలియక పోలేదు. కన్న తండ్రినే చంపిన కిరాతకుడవు!' అన్నాడు గుణసాగర్.

దుర్ముఖి సాగర్ మాటలు లెఖ్ఖ చేయకుండా తంత్రవేత్త ఎదుటకు వెళ్ళాడు. 'సద్గుణ తంత్రవేత్తగారు! ధర్మ మార్గాన్ని అవలంబించినట్టున్నారూ-అందుకే తొందరగా మోక్షం కలుగుతూంది!' అన్నాడు ఎగతాళిగా.

తంత్రవేత్త చిన్న నవ్వు నవ్వి 'దుర్ముఖీ! నీ అంత్య ఘడియలు సమీపించాయి. నీ మంచి కోరి చెపుతున్నాను. నిర్మల హృదయంతో కాసేపు భగవంతుని ప్రార్థించుకో!' అన్నాడు జాలిగా.

గుణసాగర్ అనుమానంగా తంత్రవేత్త ముఖంలోకి చూశాడు. తంత్రవేత్త ఆ చూపులో ఉన్న భావాన్ని గమనించాడు. 'రాజకుమారా! నేను అబద్ధం చెప్పలేదు. యదార్థంగా ఇతని జీవితం అంతమయ్యే సమయం సమీపించింది. జ్యోతిష శాస్త్రంలో పొరపాటు లేకుండా ఉంటే, ఇతను మన కళ్ళ ముందే మరణిస్తాడు!' అన్నాడు.

తంత్రవేత్త అన్న మాటలు దుర్ముఖికి చాలా కోపాన్ని కలిగించాయి. అతను కత్తి తీసి తంత్రవేత్త మీదకు ఉరికాడు. 'ఎవరు ముందు చస్తున్నారో చూడు...' అంటూ ఆవేశంతో కత్తి పైకెత్తాడు. అదే సమయంలో రివ్వుమంటూ ఒక బాణం వచ్చి దుర్ముఖి చేతిలో గ్రుచ్చుకు పోయింది! అతని చేతిలో ఉన్న కత్తి క్రింద పడిపోయింది. గాయం తగిలిన చేతినుంచి రక్తం కారుతూంది. అతను బాగా మూల్గి నాలుగు వైపులా చూడసాగాడు.

గుణసాగర్ ఆశ్చర్యంగా తంత్రవేత్త ముఖంలోకి చూస్తున్నాడు. కాని, తంత్రవేత్త అది గమనించకుండా దుర్ముఖి వంక జాలిగా చూస్తున్నాడు.

కాసేపటికి ధైర్యం తెచ్చుకున్న దుర్ముఖి తన మనుషులతో 'బాణం వేసిన వాళ్ళను పట్టుకుని తీసుకు రండి,' అన్నాడు.

వెంటనే ఆ మనుషులు ఇద్దరూ అరణ్యంలో చొరబడ్డానికి సిద్ధమయ్యారు.

తంత్రవేత్త వాళ్ళను చూసి పకపకా నవ్వి 'నజీరుద్దీన్! మహమ్మదాలీ! ఇక మీరు దుర్ముఖి ఆజ్ఞను పాటించ వలసిన అవసరం లేదు. భార్యా, పిల్లల మీద మమకారం ఉంటే వెంటనే ఇక్కడనుండి వెళ్ళిపొండి. లేకపోతే దుర్ముఖితో పాటు మీరు కూడా మరణిస్తారు,' అన్నాడు.

గుణసాగర్ తంత్రవేత్త నోటినుంచి వచ్చిన ఆ పేర్లు వినగానే ఆ మనుషుల వంక చూశాడు. ఆ ఇద్దరు తంత్రవేత్తల మాటలు వినగానే ఒకరి నొకరు ఆశ్చర్యంగా చూసుకుంటూ నిలబడిపోయారు.

దుర్ముఖి ఇక సహించలేక పోయాడు. గుణసాగర్‌ని, తంత్ర వేత్తను ఆ నిమిషంలో చంపివేయాలనుకున్నాడు. కాని, అంతలోనే తన అభిప్రాయం మార్చుకున్నాడు. తను అప్పటి వరకూ వెంటాడుతూ వచ్చిన రాగమణి సమీపంలోనే ఎక్కడో తల దాచుకుని ఉంటుందని తలపోశాడు. ఆమెను కూడా సుమతితో పాటు బంధించి, తర్వాత అందరినీ ఒకేసారి చంపాలని నిశ్చయించుకున్నాడు. అతను నజీరుద్దీన్, మహమ్మదాలీల వైపు చూసి 'మీరు తొందరగా రాగమణిని, సుమతిని పట్టుకుని ఇక్కడకు తీసుకు రండి. అంత వరకు నేను ఇక్కడే ఉంటాను,' అన్నాడు.

నజీరుద్దీన్, మహమ్మదాలీ చెట్ల మధ్యకు వెళ్ళి మాయమై పోయారు.

'దుర్ముఖీ! చనిపోయే ముందైనా ఒక సత్కార్యం చేస్తే మోక్షం లభిస్తుంది. ధర్మపరుడు, సత్యశీలుడు అయిన రాజ

కుమారుణ్ని బంధించడం న్యాయం కాదు. ఆయన్ని విడిచిపెట్టు,' అన్నాడు తంత్రవేత్త.

'సద్గుణాచార్యా! మన్నించండి. ఆ నీచుని దయ సంపాదించి నాకు ప్రాణదానం చేయవలసిన అగత్యం లేదు. చావంటే నాకు భయం లేదు. నవ్వుతూ ప్రాణాలు విడిచి పెడతాను గాని, ఈ పితృ హంతకుడి అనుగ్రహాన్ని ఎన్నడూ స్వీకరించను,' అన్నాడు గుణసాగర్ దృఢంగా.

సాగర్ మాటలు దుర్ముఖి దురహంకారాన్ని చాలా రెచ్చగొట్టాయి. అతను మొలలో ఉన్న బాకు తీసి సాగర్‌ని పొడవడానికి ముందుకు వచ్చాడు. కాని, అంతలోనే మరొక బాణం వచ్చి అతని గుండెల్లో దిగబడిపోయింది. దుర్ముఖి నేల మీద పడి గిలగిల కొట్టుకుని ప్రాణాలు విడిచాడు.

'సద్గుణాచార్యా! మీ మాటలు అక్షరాల నిజమయ్యాయి! ఇతను మరణిస్తాడని ఎలా చెప్పగలిగారు?' అన్నాడు ఉత్సాహంగా గుణసాగర్.

'రాజకుమారా! ముందు మీరు త్రాళ్ళు విప్పుకు బయట పడండి. తర్వాత అన్ని విషయాలు మాట్లాడుకుందాము,' అంటూ తంత్రవేత్త కూడా తన కట్లను విప్పుకోడానికి ప్రయత్నించసాగాడు. కాని, ఎంత ప్రయత్నించినా ఆ కట్లు విడే సావకాశం కనిపించడం లేదు.

గుణసాగర్ కూడా చాలాసేపు పెనగులాడి ప్రయోజనం కనబడక ఆలోచిస్తూ నిలబడ్డాడు. అంతలోనే తన కట్లు ఒదిలినట్టు భ్రమించి త్రాడును చూశాడు. అది అతని భ్రమ కాదు; యథార్థంగా త్రాడు ముడి విడిపోయింది. అతను తొందరగా కట్లు ఒదుల్చుకుని తంత్రవేత్తను కూడా బంధవిముక్తుణ్ణి

చేశాడు. తర్వాత అతనా ప్రదేశమంతా వెదకడం మొదలు పెట్టాడు.

అది చూచి తంత్రవేత్త 'రాజకుమారా! ఏమిటి, వెదుకుతున్నావు?' అంటూ అతన్ని సమీపించాడు.

'ఆచార్యా! చాలా ఆశ్చర్యంగా ఉంది. నా కట్లు నేను ప్రయత్నించినంతసేపూ విడలేదు. అలసట వచ్చి నిలబడ్డాను. ఆ సమయంలోనే విముక్తి కలిగింది. ఏమిటీ వింత! ఎవ్వరూ కనిపించరు? ఆ త్రాడు ముళ్ళు ఎలా విడిపడ్డాయి?' అన్నాడు గుణసాగర్.

తంత్రవేత్త కాసేపు కళ్ళు మూసుకున్నాడు. తర్వాత అతను గుణసాగర్‌ని చూస్తూ 'రాజకుమారా! నిన్ను ఈ వనదేవతే విడిపించింది,' అన్నాడు నవ్వుతూ. ఆ మాట విని రాజకుమారుడు కూడా నవ్వకుండా ఉండలేకపోయాడు.

కొంతసేపటికి నవ్వడం మాని 'ఆచార్యా! మీరు పూజలో కూర్చుని పద్మం వేసి దానిలో మీరు తలచినవారు ఎక్కడున్నారో, ఏమి చేస్తున్నారో తెలుసుకోగలరని విన్నాను. రాగమణిని ఒకసారి పద్మంలో చూసి ఆమె స్థితి ఎలా ఉందో చెప్పండి,' అన్నాడు గుణసాగర్ విచారంగా.

'రాజకుమారా! దిగులు పడవద్దు. ఇపుడే పూజలో కూర్చుంటాను,' అని తంత్రవేత్త పూజా ప్రయత్నం చేయసాగాడు.

## ౩౨

ప్రమాదం తొలగిపోవడంతో రాయిమీద కూర్చున్న రాగమణి, సుమతి మళ్ళీ మాటల్లోకి దిగారు.

'రాజకుమారీ! మనం ఈ ప్రాంతంలో ఎక్కువ కాలం ఉండడం మంచిది కాదు. దుర్ముఖి తన అనుచరులతో మనలను వెదుకుతూనే ఉంటాడు. వాళ్ళకు మనం దొరక్కుండా

ఉండాలంటే ఏదో విధంగా ఈ అడవిలోంచి బయటపడాలి. అదృష్టం అనుకూలంగా ఉండి అక్కడ ఎవరైనా కనబడితే దారి తెలుసుకుని సుందరగడం చేర వచ్చు,' అంది సుమతి.

'నువ్వు అన్న మాట నిజమే! కాని, మనం ఇప్పుడెక్కడ ఉన్నామో తెలియనపుడు ఎలా ఈ అడవి దాటగలం? ఇంకా ఎన్ని ప్రమాదాలు ఎదుర్కోవాలో, ఎన్నాళ్ళు ఈ అడవిలో తిరగాలో తెలియడం లేదు,' అంది రాగమణి ఆలోచిస్తూ.

'ఎలాంటి ప్రమాదాలు వచ్చినా నేను ఉండగా మీకేమీ భయం లేదు. ఈవేళ కాకపోతే రేపైనా ఈ అడవిలోంచి అవతల పడగలం. లేవండి. మరి కొంత దూరం నడుద్దాం.'

'సుమతీ! కాసేపటి వరకు ఇక్కడ నుంచి కదలలేను. కొంచెం విశ్రాంతి తీసుకుని వెడదాం,' అంది రాగమణి.

అంతలో ప్రక్క నున్న పొద వెనుకనుంచి మాటలు విన బడసాగాయి.

రాగమణి, సుమతి బాణాలు చేతిలోకి తీసుకుని మౌనంగా ఆ మాటలు వస్తున్న వైపే చూస్తున్నారు.

మళ్ళీ మాటలు వినబడసాగాయి.

'నజార్! కొద్ది రోజుల్లో దుర్ముఖ ప్రచండ దుర్గానికి అధి కారి అయ్యే సూచనలు కనబడుతున్నాయి. అప్పుడు నేను సైన్యాధిపతినౌతాను,' అన్నాడు మొదటి అతను.

నజీర్ పేరు వినబడ్డంతోనే రాగమణి, సుమతి చప్పుడు కాకుండా ఆ పొద దగ్గరకు చేరి వారి మాటలు వినసాగారు.

'మహమ్మదాలీ! నువ్వే పెద్ద తెలివైన వానిలా మాట్లాడు తున్నావు. నాకూ ఆ మాత్రం తెలియకపోలేదు. నేను నీకంటే ముందు జాగ్రత్త పడ్డాను. దుర్ముఖి ప్రచండ దుర్గానికి రాజు అయిన వెంటనే నన్ను మంత్రిగా చేసుకోడానికి

ఖరారునామా ఉత్తరం కూడా వ్రాయించి పుచ్చుకున్నాను. తెలుసా!' అన్నాడు నజీర్ గర్వంగా.

'రోజులు బాగుండకపోతే ఎన్ని ఉత్తరాలు వ్రాయించుకున్నా ఒకటే! చూడు, రాగమణిని విడిపించడానికి వచ్చిన రాజకుమారుడు గుణసాగర్ తలవని తలంపుగా మన చేతిలో పడ్డాడు. మారు వేషాలు వేసుకుని మనం రాజకుమారిని వెదుకుతుంటే రాజకుమారుడు వచ్చి మన వలలో చిక్కాడు. రాజకుమారుని పక్షంలో చేరిన సద్గుణ తంత్రవేత్తకు కూడా మంచి శాస్తి జరిగింది. లేకపోతే తిన్నంత కాలం తిని మహారాజుకు ఎదురు తిరుగుతాడా?'

'దుర్ముఖి కూడా సరిగ్గా సమయానికి వచ్చాడు. రాజకుమారుని పేరు చెబితేనే పళ్ళు కొరుకుతున్నాడు. ఈసారి అతన్ని ప్రాణాలతో విడిచి పెట్టడు. తప్పకుండా తన కత్తికి బలి చేస్తాడు. ఆ పని రాగమణి చూస్తూండగా చేయాలని అతని ఉద్దేశం. రాగమణి, సుమతితో కలిసి ఇటే పారిపోయి వచ్చింది. ఈ సమీపంలోనే ఎక్కడో ఉంటుంది. తొందరగా వెదకి ఆమెను బంధించి తీసుకువెడితే మనకు కూడా మంచి బహుమతి లభిస్తుంది,' అన్నాడు నజీరుద్దీన్.

రాజకుమారి వారి మాటలు విని కంపించిపోయింది. కన్నీరు ధారగా ప్రవహించసాగింది. చేతిలో ఉన్న బాణాలు జారిపోయాయి. ఆమె తెలివి తప్పి నేలమీదకు ఒరిగిపోతూంది.

సుమతి అంతకు ముందే రాగమణి స్థితిని గమనించింది. తెలివి తప్పిన రాజకుమారిని క్రింద పడకుండా అదిమి పట్టుకుంది. ఆమెను తన భుజంమీద వేసుకుని నెమ్మదిగా అక్కడ నుండి కదలిన సుమతి తొందరగా పరుగెత్తసాగింది.

నజీరుద్దీను, మహమ్మదాలీ పొద ఇవతలకు వచ్చారు. వారి చూపులు అక్కడ పడి ఉన్న విల్లంబుల మీద పడ్డాయి. నజీరుద్దీన్ ఆ బాణాలు చేతిలో పట్టుకుని 'మహమ్మదాలీ! రాగమణి ఇక్కడే ఉంది. తొందరగా వెదుకు,' అన్నాడు.

'ఆ మాట నువ్వు వేరే చెప్పాలేమిటి! రాగమణిని, సుమతిని మనం వెంటాడుతూన్నపుడు సుమతి చేతిలో ఉన్న బాణాలను నేనూ చూశాను. అప్పుడు ఈ బాణాలు వాళ్ళ దగ్గర లేకపోతే మనం వాళ్ళను విడిచిపెడతామా!' అని మహమ్మదాలీ అటు ఇటు చూసి వ్రేలితో ఒక వైపుకు చూపిస్తూ 'ఇటే వెళ్ళారు, రా-చూద్దాం!' అని ముందుకు రెండడుగులు వేశాడు.

అంతలో ఒక బాణం వచ్చి అతని ముందు పడింది. బాణానికి ఆకు ఒకటి చుట్టబెట్టి ఉంది. మహమ్మదాలీ తొందరగా బాణానికి ఉన్న ఆకు విప్పి చూశాడు. దానిమీద ఇలా వ్రాసి ఉంది:

"దుర్మార్గులారా! రాజకుమారిని పట్టుకోవడం అంత తేలికైన పని కాదు. ఆశ్రయమిచ్చి కాపాడిన ప్రతాపసింహుడ్ని మోసగించి, అతన్ని సంహరించి ప్రచండదుర్గపు సింహాసనం మీద కూర్చోవాలనుకున్నాడు మీ నాయకుడు దుర్ముఖి. అండగా నిలచిన రాణినే అంతమొందించదలచుకున్న దుర్ముఖి దురుద్దేశం తెలుసుకున్నాను. అతన్నికి ఈ లోకంలో ఉండడం మంచిది కాదని భావించాను. ఇప్పుడే అతన్ని ఈ ప్రపంచానికి దూరం చేశాను.

ఇక మీరు మిగిలిపోయారు. మీ రోజులు కూడా సమీపించాయి. మీ ఇద్దరకు ఇంకా కొంత కాలం బ్రతకాలనే ఆశ ఉంటే, రాజకుమారి మాట మరచిపోండి. ఆమెను వెదకడం మానండి. ఈ అరణ్యంలో ఉన్నంత కాలం ఆమెకు ఎవరూ ఎలాంటి హానీ కలి

గించలేను. మీరు ఇక్కడనుండే వెనక్కి తిరగండి. కాదని కాలు ముందుకు వేస్తే, మరు క్షణంలో మీ ప్రాణాలు పోతాయి.

—వనదేవత."

ఆకు మీద ఉన్న మాటలు చదువుకుని, వనదేవత పేరు చూడగానే ఇద్దరూ కొయ్యబారిపోయారు. కాసేపటికి ధైర్యం తెచ్చుకుని ఒకరినొకరు పలుకరించుకున్నారు.

అయినా వారిలో కలిగిన భయం ఇంకా పూర్తిగా తొల్లగిపోలేదు. తడబడుతున్న నాలుకతో 'ఆలీ! ఎవరీ వనదేవత? ఇక్కడికెలా వచ్చింది? రాగమణికి, ఈమెకు సంబంధమేముంది?' అన్నాడు నజీరుద్దీన్.

మహమ్మదాలీ చుట్టూ చూశాడు. అతని కంటికి ఎవరూ కనిపించకపోవడంతో 'నజీరుద్దీన్! వనదేవత అంటే మనిషి కాదనుకుంటున్నాను. హిందువులు దేవతల్ని ఆరాధిస్తుంటారని నీకు తెలీదూ! కీర్తిసేన మహారాజు కూడా సుందరగడంలో ఉన్న దుర్గాలయానికి వెళ్ళి రోజూ పూజలు చేయిస్తూండడం నువ్వు చూడలేదూ?' అన్నాడు నెమ్మదిగా.

'చూశాను. కాని, ఆ కాఫిర్ పద్ధతుల్లో నాకు నమ్మకం లేదు.'

'నమ్ము, నమ్మకపో; అలా పూజిస్తుంటే ఆపదల్లోను, అవసర సమయాల్లోను ఆ దేవతలు వచ్చి సహాయపడుతుంటారని వాళ్ళ నమ్మకం!'

'ఆలీ! రాళ్ళూ, రప్పలూ సహాయపడుతాయనుకోవడం చాలా పొరపాటు. ఏమి చేసినా అల్లా చేయాలి.'

'నిజమే! అల్లా కరుణిస్తే కొద్ది రోజుల్లో సైన్యాధిపతి పదవి నాకు వస్తే,మంత్రిగా నువ్వు రాణిస్తావు,' అన్నాడు నజీరుద్దీన్.

మహమ్మదాలీ మళ్ళీ ఒకసారి ఆకు మీద రాసిన అక్షరాలు ఒక్కొక్కటి చొప్పున చదువుకుని కాసేపు ఆలోచించాడు. తర్వాత నెమ్మదిగా తల పైకెత్తి నజీర్ ముఖంలోకి చూసి 'నజీర్! మన ఉద్యోగాలు, పదవుల సంగతి అలా ఉంచు. ఈ ఉత్తరంలో ఉన్న మాటలు నిజమే అయితే, దుర్ముఖి ప్రాణాలు గాలిలో కలిసిపోయినట్టే!' అన్నాడు.

మహమ్మదాలీ అన్న మాటలు విని నజీరుద్దీన్ మండిపడ్డాడు. 'అలీ! దుర్ముఖిని చంపడం అంత తేలిక అయిన పని కాదు. అందులోను, ఈ ఆకు మీద అక్షరాలు చూస్తే ఎవరో గూఢ చారులు రాసినట్టు అనుమానంగా ఉంది. ఒకవేళ రాజ కుటుంబం పూజించే ఆ రాతి బొమ్మలోనే అంతటి శక్తి ఉంటే, మన ముందుకు వచ్చి ఎందుకు నిలబడకూడదు? సుమతి కూడా రాజకుమారి వెంటే ఉంది. ఆమె జిత్తులమారి జాణ అని నీకూ తెలుసు. మనల్ని భయపెట్టడానికి ఆమే ఈ పని చేసి ఉంటుంది. ఆడది చేసిన పనికి అదిరిపోయే మగవాడవు బయలుదేరావు. నీకంత భయంగా ఉంటే, నా వెనకాల నడు. నా కంఠంలో ప్రాణం ఉండగా రాగమణిని వదలక్క మానను,' అంటూ అతను ముందుకు అడుగు వేశాడు.

మహమ్మదాలీ నిలబడిన చోటునుంచి కదల్లేదు. 'నజీర్! తొందరపడకు. బాగా ఆలోచించు. పొరపాటు చేస్తే ప్రాణాల మీదకు వస్తుంది. రాగమణిని పట్టుకుంటే మనకు వచ్చేదేమీ లేదు. కాని, వనదేవత మాట కాదని ముందుకు వెడితే ప్రాణాలు పోతాయి. తెలిసి ప్రమాదాన్ని ఎందుకు తెచ్చుకోవాలి! రా, వెనక్కి పోదాం. ఎంత వెదకినా రాగ మణి కనబడలేదని చెపుదాం,' అన్నాడతను.

నజీర్ కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి. అతను మహమ్మదాలీ కళ్ళల్లో కళ్ళు పెట్టి చూస్తూ 'మహమ్మదాలీ! పౌరుష

హీనంగా మాట్లాడుతున్నావు. ఇస్లాం మతానికే అవమానం కలిగిస్తున్నావు. ఆడదాని బెదరింపులకు హడలి పోతున్నావు. ఛీ, ఛీ! నువ్వింత పిరికివాడవని అనుకోలేదు. నీకంత భయంగా ఉంటే వెళ్ళిపో. నేనే రాగమణిని బంధించి తీసుకు వస్తాను,' అని చురుగ్గా రెండడుగులు ముందుకు వేశాడు.

మహమ్మదాలీ కూడా విధిలేక నజీరుద్దీన్ వెనకాల నడవ డానికి సిద్ధపడుతున్నాడు.

అంతలో రివ్వుమంటూ వచ్చిన బాణం నజీరుద్దీన్ గుండెల్లో గుచ్చుకుపోయింది. అతను 'అబ్బా!' అని అరచి నేల మీద పడిపోయాడు.

మహమ్మదాలీకి భయంతో శరీరం ఒణికిపోతూంది. చెమటతో బట్టలు తడిసిపోతున్నాయి. అతను తడబడుతూ నెమ్మదిగా నడచి నజీరుద్దీన్‌ని చేరుకున్నాడు. అప్పటికే నజీ రుద్దీన్ ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి.

నజీరుద్దీన్ మరణించాడని తెలుసుకోవడంతో మహమ్మ దాలీ కాలికి బుద్ధి చెప్పాడు. అతను ఆతృతగా ప్రాణాల మీద ఆశకొద్దీ పరుగెత్తసాగాడు. కాని, అతను ఒక చెట్టు ప్రక్కనుండి తప్పుకుంటూండగా బలమైన చెయ్యి ఒకటి అతన్ని పట్టుకుని ఆపుచేసింది. మహమ్మదాలీ అదరిపడి వెనక్కు చూసే లోపున గుండెల్లో దిగబడిన బాకు అతని ప్రాణాలు తీసింది!

## 40

స్వప్రమతి తెలివి తప్పిన రాజకుమారిని ఇసుక తిన్నె మీద పరుండబెట్టి ఉత్సాహంగా చుట్టూ చూసింది. ఒక వైపు తను వచ్చిన వైపున్న అడవి భయంకరంగా కనబడుతూంది. ఎదుట ఎడారిలా కనబడుతూన్న నిర్జన ప్రదేశం ఉంది. ఆ

విశాల స్థలంలో కొంచెం దూరంగా ఒక భవనం కనబడు తూంది. పాడుపడి ఉన్న ఆ భవనం చాలా పెద్దదిగాను, ఎత్తు గాను ఉంది.

ఊహించని విధంగా అడవిలోంచి బయటపడినందుకు సుమతి ఎంతో సంతోషిస్తూ రాజకుమారికి తెలివి కలిగించ డానికి ప్రయత్నించసాగింది.

కాసేపటికి రాగమణి కళ్ళు విప్పి చుట్టూ చూసింది. నెమ్మ దిగా లేచి కూర్చుని 'సుమతీ! గుణసాగర్ ఇక్కడకు ఎందుకు వచ్చాడు? దుర్ముఖి అతన్ని ఎలా బంధించాడు? ఇప్పుడతన్ని విడిపించే మార్గమేమిటి?' అంది దిగులుగా.

సుమతి రాగమణి మాటలు విని తనలో తనే నవ్వుకుంది. 'రాజకుమారీ! గుణసాగర్ కోసం మీరేమీ గగులుపడకండి. జితేంద్రుడు కూడా ఉన్నంత కాలం ఆయనకు ఎలాంటి ప్రమాదం రాదు! అలా చూడండి - ఆ భవనం దగ్గరకు వెడదాం లేవండి. దాని లోపలకు వెడితే మనం ఎవరికీ కని పించం. అక్కడ కూర్చుని మాట్లాడుకుందాం,' అంది.

ఇద్దరూ తొందరగా ఆ భవనాన్ని సమీపించారు. అది పూర్వకాలంలో ఎవరో మహారాజు నిర్మించిన అంతఃపురంలా ఉంది. కాని, ఇప్పుడా భవనం చాలా వరకూ శిథిలమై పోయింది.

'రాజకుమారీ! మీరు లోపలకు వెళ్ళి ఆ గుమ్మం దగ్గర కూర్చోండి. ఈ లోపల నేను కొంచెం పళ్లు కోసుకువస్తాను. ఇద్దరం వాటిని తిన్న తర్వాత భవనం లోపలకు వెళ్ళి చూద్దాం. సుందరగడానికి దారి తెలిసే వరకు మనం ఇక్కడే ఉండడం మంచిది. అదృష్టం అనుకూలంగా ఉంటే తొందరలోనే ఎవరో ఒకరు ఈ మార్గాన్ని వెడుతూ కనిపిస్తారు. వారి

ద్వారా సుందరగడానికి మార్గం తెలుసుకుని ప్రయాణం సాగిద్దాము,' అంది సుమతి.

రాగమణి ఆ భవనాన్ని బయటనుంచే ఒకసారి మళ్ళీ పరికించి చూసి 'సరే, నేను ఇక్కడే కూర్చుంటాను. నువ్వు త్వరగా పళ్లు కోసుకుని రా! ఆఁ, దూరంగా మాత్రం వెళ్ళకు,' అంది.

'ఎక్కడకూ దూరంగా వెళ్ళను. మీ కళ్ళ ఎదుటే ఉంటాను. మీరు మాత్రం జాగ్రత్తగా ఉండండి,' అని సుమతి పళ్ళకోసం అరణ్యంలోకి వెళ్ళింది.

## 41

ఒంటరిగా ఉన్న రాగమణి సుమతి వచ్చే వరకు ఆ పాడు పడిన భవనంలో కూర్చోవాలన్న తలంపుతో ప్రహరీ ద్వారంలోంచి లోపలకు ప్రవేశించింది.

ఆ భవనం చాలా వరకూ పాడుపడిపోయినా మిగిలి ఉన్న నామ మాత్రపు, శిథిల శిల్పాలు, కట్టడంలో చూపించిన పనితనం రాజకుమారిని బాగా ఆకర్షించాయి.

ఆమె నెమ్మదిగా సింహద్వారాన్ని సమీపించి గడప లోపల కాలు పెడుతూండగా ఒక యువతి లోపలనుంచి పరుగెత్తుని వచ్చి రాగమణికి ముందు నిలబడి వినయంగా చేతులు జోడించి నమస్కరించింది.

రాగమణి ఆ యువతిని చూచి మొదట కొంచెం కంగారు పడినా, తర్వాత ధైర్యం తెచ్చుకుని 'ఈ భవనం ఎవరిది? నువ్విక్కడ ఏమి చేస్తున్నావు?' అంది.

ఆ యువతి మళ్ళీ రాగమణికి నమస్కరించి 'అమ్మా! ఆ వివరాలు చెప్పాలంటే చాలా కాలం పడుతుంది. ఈ భవనం

తమదిగానే భావించండి. నేను తమ సేవ చేయడానికే ఇక్కడ ఉన్నాను,' అంది.

రాగమణికి ఆమె చెప్పిన మాటలు చాలా ఆశ్చర్యాన్ని, అనుమానాన్ని కూడా కలిగించాయి. 'అయితే నేను ఇక్కడకు వస్తానని నీకు తెలుసునా?' అందామె నెమ్మదిగా.

'నాకే కాదమ్మా! ఈ భవనంలో ఉన్నవాళ్ళందరకూ తెలుసు. మేమందరం మీ రాకకోసమే ఎదురు చూస్తున్నాం. ఈనాటికి మా తపస్సు ఫలించింది,' అంది ఆ యువతి.

'నువ్వు పొరపాటు పడుతున్నావు. నాకీ భవనంతో ఏమీ సంబంధం లేదు. దారి తెలియక ఇలా వచ్చాను. నుండర గడానికి మార్గం చెపితే కోరినంత సొమ్ము ఇప్పిస్తాను.'

'రాజకుమారీ! ఆందోళన చెందకండి. ఈ భవనం, భవనం లోపలి సర్వ సంపదలూ మీవే! అనుమానించక లోపలికి రండి,' అని ఆ యువతి వెనక్కు తిరిగింది.

రాగమణి కాలు కదపలేదు. ఆమెకు అదంతా ఒక కలలా అనిపిస్తూంది. ఆ యువతి చెప్పిన మాటలన్నీ జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఆమె ఆలోచనలో మునిగిపోయింది. కొంతసేపటికి తేరుకుని రాజకుమారి ముందుకు చూసింది. అప్పటి వరకూ మాట్లాడిన యువతి అక్కడ లేదు. రాజకుమారికి ఒక్కసారి శరీరం జలదరించింది. ఆమె భయంతో వొణికిపోతూంది. అకస్మాత్తుగా ఆమెకు కలిగిన ఆలోచనే అందుకు కారణమైంది. 'ఈ యువతికి నేను రాజకుమారినని ఎలా తెలిసింది? ఇక్కడకు వస్తానని ఎవరు చెప్పారు? ఈ పాడుపడిన భవనంలో ఈమె నిర్భయంగా ఎలా ఉంటూంది? తనతోపాటు ఇంకా కొందరు ఈ భవనంలో ఉన్నారని చెప్పింది; వాళ్ళందరూ ఎవరు? వాళ్ళకు జీత భత్యాలు ఎవరిస్తున్నారు? ఈ భవనం మా రాజ్యంలోనిదే అయితే, నాన్నగారు ఈ సంగతి

నాతో ఒక్కసారి చెప్పకుండా ఉంటారా? కాదు-కాదు, ఈ ప్రదేశం మా దేశానికి సంబంధించి కాదు. ఇది మనుష్యులు నివసిస్తున్న ఇంటిలాగే లేదు! పాడుపడిన గృహాల్లోను, నిర్మానుష్య ప్రాంతాల్లోను దయ్యాలు, భూతాలు నివాసం ఏర్పరచుకుంటాయని విన్నాను...అయితే, ఇప్పుడు నాకు కనబడి, నాతో మాట్లాడిన యువతి ఒక వేళ...' రాగమణి ఇక ఆలోచించలేకపోయింది. ఆందోళనతో గట్టిగా అరచి క్రింద పడిపోతూండగా నలుగురు పరిచారికలతో ఆ యువతి అక్కడకు వచ్చి రాజకుమారిని గట్టిగా పట్టుకుంది. పరిచారికల్లో ఒకామె రాజకుమారి ముఖంమీద పన్నీరు చిలకరించింది. మరొకామె నెమ్మదిగా విసరసాగింది. ఇంతలో మిగిలిన ఇద్దరూ లోపలకు వెళ్ళి, ఒక గ్లాసులో ద్రాక్షరసం, మరొక గ్లాసులో నిమ్మ షర్బత్తు తెచ్చి అక్కడ ఉంచారు.

పరిచారికలు చేసిన ఉపచారం వల్ల రాజకుమారికి వెంటనే తెలివి వచ్చింది. ఆమె కళ్ళు విప్పి చుట్టూ చూసింది. ఆమె దృష్టి ప్రక్కనే ఉన్న యువతి మీద, పరిచారికల మీద పడగానే ఆందోళనతో రెండు చేతులతోనూ కళ్ళు మూసుకుని 'పొండి, మీరందరూ వెళ్ళిపొండి. మీరు మనుష్యులు కారు. నాకు తెలుసు. నా దురదృష్టమే నన్నిక్కడకు ఈడ్చుకు వచ్చింది. నన్ను విడిచిపెట్టండి. నేను బయటకు పోతాను,' అంది వొణుకుతున్న గొంతుకతో.

మొదటి యువతి రాజకుమారికి ద్రాక్ష రసం ఇస్తూ 'అమ్మా! భయపడకండి. మీరు అనుకుంటున్నట్టుగా మేము దయ్యాలమూ, భూతాలమూ కాము. మా వల్ల మీకేలాంటి ఆపదా సంభవించదు. మీకు సేవ చెయ్యడానికే మా యజమాని మమ్మల్ని ఇక్కడ కాపలా పెట్టారు,' అంది.

ఆ యువతి అన్న చివరి మాట వినగానే రాగమణి గుండెలు మరొకసారి దడదడలాడాయి. 'ఎవరు మీ యజమాని? ప్రతాపసింహుడు కాదు కదా?' అంది ఆరిపోతున్న పెదాలను నాలుకతో తడుపుకుంటూ.

'కాదమ్మా! ప్రతాపసింహుడు మిమ్మల్ని ఇక ఏమీ చేయలేడు. మీకు అపకారం తలపెట్టినవాళ్ళెవరూ ఇక్కడ వరకూ రాలేరు; వచ్చినా ప్రాణాలతో తిరిగి వెళ్ళడం అసాధ్యం. మీరు నిశ్చింతగా ఉండండి,' అని లోపలనుంచి వినబడింది.

అది మగ గొంతుక. అయినా చాలా మృదువుగా ఉంది, వినయం ఉట్టిపడుతూందా గొంతుకలో.

రాగమణి ఆ మాటలు వచ్చిన వైపు తల త్రిప్పి అనుమానంగా చూసింది. 'అమ్మా! ఆయనే మా యజమాని. తమ రాక కోసం కళ్ళు కాయలు కాచేలా చూస్తున్నారు. తమరీ భవనంలో కాలు పెట్టే వరకూ ఆయన మనస్సుకు శాంతి లేదని ఎన్నోమార్లు అన్నారు. తమ రాకను తెలియజేసినపుడు ఆయన ఆనందానికి అంతు లేకపోయింది. రండి, లోపలకు వెడదాము,' అంది.

రాగమణి యువతి ముఖంలోకి చూస్తూ 'నీ పేరేమిటి?' అంది.

'నన్ను 'మోహిని' అంటారు. రండి, భవనం లోపలి విశేషాలు చూపిస్తాను,' అంది ఆ యువతి ముందుకు నడుస్తూ.

రాగమణి నెమ్మదిగా ఆమెను అనుసరిస్తూ 'మోహినీ! మీ యజమాని నా క్షేమం కోరేవాడైతే నా ఎదుటకు వచ్చి మాట్లాడ్డానికి భయమెందుకు?' అంది లేని ధైర్యం తెచ్చుకుని.

మోహిని రాగమణికి సమాధానం చెప్పడానికి ముఖం వెనుక్కు త్రిప్పింది.

అంతలో 'రాజకుమారీ! మన్నించండి. నేను మీ ఎదుటకు రావడానికి తగను. అంతే కాదు; ఇక ముందు మీతో మాట్లాడగల సమర్థత కూడా నాలో లేదు. మీకు ఏమి కావలసినా మోహిని ఉంది. ఆమే సర్వ వేళల మీతో ఉంటుంది. మీ ఆజ్ఞలను శిరసా వహిస్తుంది. ఆమె మిమ్మల్ని ఇపుడొక ప్రత్యేక భవనానికి తీసుకు వెడుతుంది. ఆ భవనం మీకు అన్ని విధాల ఆనందాన్ని చేకూరుస్తుందని ఆశిస్తున్నాను. ఇక్కడున్న ప్రతి వస్తువూ మీది. నాతో సహా ఈ భవనంలో ఉన్నవాళ్ళందరూ మీ సేవకులే. ఇంతకంటె మీకు చెప్ప వలసింది లేదు,' అన్నాడు యజమాని లోపలనుంచి.

రాగమణి తిరిగి అతన్ని ఏదో ప్రశ్నించబోతుండగా 'అమ్మా! ఇక యజమాని తమతో మాట్లాడరు. తమరు ఆయన్ని ఏది అడగదలచుకున్నా నాతోనే చెప్పాలి. యజ మాని దగ్గరనుండి సమాధానం తెస్తూంటాను,' అంది మోహిని.

అంతలో అక్కడకు వచ్చిన పరిచారికలు రాజకుమారి నడిచే మార్గంలో పూలు జల్లుతూండగా మోహిని ఆమెను లోపలికి తీసుకు పోసాగింది.

రాగమణికి అక్కడ జరుగుతున్నది కలో, నిజమో తెలియడం లేదు.ఆమె తనకు వాళ్ళు శత్రువులో, మిత్రులో తెలుసుకోలేని స్థితిలో పడింది. వాళ్ళను అనుమానించి, భవనంలోంచి బయటకు రావడానికీ మనస్సు అంగీకరించడం లేదు; నమ్మి లోపలకు వెళ్ళడానికి సాహసం కలగడం లేదు.

రాగమణి తెలిసీ తెలియని అయోమయ స్థితిలో ఉండగా మోహిని ఆమెను నెమ్మదిగా లోపలికి తీసుకు పోసాగింది.

'నా చెలికత్తె సుమతి పళ్ళకోసం ఉపవిలోకి వెళ్ళింది. ఆమెను వెంటనే నా దగ్గరకు చేర్చండి,' అంది రాగమణి నడుస్తూ.

'అలాగేనమ్మా!' అంది మోహిని తనలో తానే నవ్వు కుంటూ.

## 42

సుమతి ఒడి నిండా పళ్లు కోసుకుని అడవి లోంచి బయటకు వచ్చి భవనాన్ని సమీపించింది. పళ్ళు ఒక చోట ఉంచి, రాజకుమారి కోసం అన్ని వైపులా చూసింది. కాని, ఆమెకు రాగమణి ఎక్కడా కనిపించ లేదు. చివరకు రాగమణి ఆ భవనం లోనికే వెళ్ళి ఉంటుందని నిశ్చయించుకుని, ఆమెను వెదకడం నిమిత్తం సుమతి కూడా ప్రహరీ ద్వారం దాటి లోపలకు వెళ్ళింది.

ఆమె ద్వారం దగ్గరే నిలబడి భవనాన్ని నిదానించి చూసింది. తను అనుకున్నంత పాడుపడి లేదా భవనం. సుమతి నెమ్మదిగా భవనాన్ని సమీపించింది. అక్కడక్కడ కొద్ది కొద్దిగా కూలిపోయినా, మిగిలిన భాగమంతా చాలా గట్టిగాను, చూడ్డానికి ముచ్చటగాను ఉంది. ఆమె ఇంకా ముందుకు వెళ్ళింది. ఒక హాల్లో ప్రవేశించింది. అక్కడ మిద్దె అంతా కూలిపోయింది. అయినా చుట్టూ ఉన్న స్తంభాలు చెక్కు చెదరకుండా నిలబడి ఉన్నాయి' అటు-ఇటు ఇటు కలు పోగులు పోగులుగా పడి ఉన్నాయి. సుమతి అడుగులో అడుగు వేసుకుంటూ ఆ ఇటుకల మీంచి నడచి అవతలకు వెళ్ళింది.

అక్కడ కనబడుతూన్న ఖాళీ ప్రదేశాన్ని చూడగానే సుమతి నిలబడిపోయి చుట్టూ పరికించ సాగింది. ఆ ప్రదేశంలో చలువరాతి తిన్నెలు, నీటి కాల్వలు, జల యంత్రాలు— ఇంకా ఎన్నో రక రకాల పూల మొక్కలు కనబడు తున్నాయి. సుమతి వాటన్నిటినీ చూసి పూర్వం అదొక ఉద్యాన వనంగా రాణించిందని గ్రహించింది. అయితే

'ప్రస్తుతం సంరక్షణలేని ఆ ప్రాంతంలో పూల మొక్కలు ఎలా బ్రతికి ఉన్నాయి?' అనే సందేహం మాత్రం ఆమెను విడిచి పెట్టలేదు.

సుమతి ఆ ఖాళీ స్థలం దాటి అవతలకు వెళ్ళింది. అక్కడ ఒక సన్యాసి కళ్ళు మూసుకుని తపస్సు చేసుకుంటున్నాడు.

ఆజానుబాహుడైన అతని శరీరం రంగు బంగారంతో సమానంగా ఉంది. తలనుండి వ్రేలాడుతున్న జడలు నేలను తాకుతున్నాయి. గడ్డం బొడ్డు వరకూ వ్యాపించి, వక్షస్థలాన్ని మరుగుపరుస్తూంది. ఒక వైపు కమండలం, రెండవ వైపు యోగదండం ఉన్నాయి. ముఖంలోని వర్చస్సు చూస్తే, అతను త్రికాలవేదిలా కనబడుతున్నాడు.

సుమతి చూపు ఆ సన్యాసి మీద పడింది. ఆమె తొందరగా అతన్ని సమీపించి రాజకుమారిని గురించి అడగాలనుకుంది. కాని, కళ్ళు మూసుకుని ఉన్న అతన్ని చూసి పలకరించడానికి భయపడి, ఏమి చేయడానికీ తోచక తికమకలు పడుతూ అలానే నిలబడిపోయింది.

కాసేపటికి సన్యాసి కళ్ళు తెరచాడు. ఎదుట నిలబడి ఉన్న సుమతిని చూశాడు. 'ఎవరు నువ్వు? ఎందుకు ఇలా వచ్చావు?' అన్నాడు.

సుమతి అతనికి నమస్కరించి 'అయ్యా! మా రాజకుమారి ఇలా వచ్చింది. నేను పళ్ళు తెచ్చే లోపున మాయమై పోయింది. జ్ఞానసంపన్నులు తమరు...దయ ఉంచి, ఆమె ఎక్కడ ఉన్నదో తెలియజేయండి,' అంది.

సన్యాసి ఒకసారి రెప్పలు తాటించి సుమతి కళ్ళల్లోకి చూశాడు. 'సుమతీ! అక్కర లేని ప్రయాస పడకుండా తిరిగి ఇంటికి వెళ్ళు. రాగమణి కోసం ప్రాకులాడితే చాలా కష్టాలు పడతావు,' అన్నాడు అతను.

'అయ్యా! మీరు మహానుభావులు; పూజ్యులు. మీరే అలా అంటే నేను చేయ గలిగింది ఏముంది చెప్పండి? ఆమె కోసం నేనెన్ని కష్టాలన్నా అనుభవించడానికి సిద్ధంగా ఉన్నాను. ఏమి చెయ్యమన్నా చేస్తాను. ఆమె ఎక్కడ ఉందో చెప్పండి,' అంది సుమతి ఆందోళనగా.

'సుమతీ! ఆపదలను కోరి తెచ్చుకోనడం మంచిది కాదు. రాగమణి మాట మరచిపో. ఆమె ఇప్పుడు నీకు అందుబాటులో లేదు,' అన్నాడు సన్యాసి ప్రశాంతంగా.

సన్యాసి చెప్పిన మాట వినడంతోనే సుమతి దుఃఖంతో కుమిలిపోయింది. 'మహాత్మా! ఏమి జరిగిందో వివరంగా చెప్పండి. నన్ను చూడగానే నా పేరుతో పిలిచారు. రాజ కుమారి పేరు కూడా తెలుసుకో గలిగారు. మీకు తెలియం దేమీ లేదు. మీ పాదాలు పట్టుకుంటాను. రాజకుమారి ఎక్కడుందో, ఎలా ఉందో తెలియజెయ్యండి,' అంది వ్యాకులంగా.

'తెలియపరిస్తే ఏమి చెయ్యగలవు?' అన్నాడు సన్యాసి.

'ఆమె కోసం ఏదైనా చేస్తాను. చివరకు నా ప్రాణాలను కూడా బలి చేస్తాను,' అంది సుమతి ఆవేశంతో.

సన్యాసి పకున నవ్వాడు. 'సుమతీ! మాటలు చెప్పినంత తేలిక కాదు-ప్రాణాలు ఇవ్వడం! పరుల కోసం జీవితాన్ని ధారపోసేవాళ్ళను నేను ఎక్కడా చూడలేదు,' అన్నాడు.

'అలాంటి అవసరమే ఏర్పడితే, ఇప్పుడు చూస్తారు. దయ ఉంచి రాజకుమారి ఉన్న చోటు చెప్పండి,' అంది సుమతి.

సన్యాసి సూటిగా సుమతి ముఖంలోకి చూశాడు. ఆమె ధైర్య సాహసాలకు గీటురాయని తెలుసుకున్నాడు. ఏ పరి

స్థితిలోనూ వెనుకంజ వేయదని గమనించాడు. రాజకుమారి యందు ఆమెకున్న భక్తి శ్రద్ధలకు చాలా సంతోషించాడు. ఆతనొకసారి కళ్ళు మూసి తెరచి 'సుమతీ! చెప్తున్నాను, విను: రాగమణి ఇపుడు సామాన్య మానవులకు అందు బాటులో లేని ప్రదేశంలో ఉంది. స్వప్నంలో కూడా ఊహించని సుఖమయ భోగాలను అనుభవిస్తూంది. ఆమె ఆజ్ఞా పించడం తడవుగా కావలసిన వస్తువు కాళ్ళ దగ్గరకు చేరు తుంది. కాని, ఆమె అస్వతంత్ర; పరాధీన. ఆమె ఉన్న భవనపుటద్దులు దాటి బయటకు రావడానికి వీల్లేదు,' అన్నాడు.

సుమతి ఆ మాటలు విని చాలా వ్యాకులపడుతూ 'మహాత్మా! అక్కడకు చేరే మార్గం సెలవీయండి,' అంది.

సన్యాసి ఒక ప్రక్కకు చూశాడు. అటే వ్రేలు పెట్టి చూపిస్తూ 'అలా చూడు, అక్కడ ఆలయం కనబడుతూంది చూశావా! దానికి కొంచెం ఎడంగా మర్రిచెట్టు ఉంది. ఆ చెట్టుకీ, ఆలయానికీ మధ్య ఒక నుయ్యి ఉంది. ఆ నూతిలోనికి దిగితే నువ్వు రాగమణిని చేరగలుగుతావు,' అన్నాడు.

సుమతి సంతోషంగా సన్యాసికి నమస్కరించి ఆలయం వైపు బయలుదేరింది. సన్యాసి చెప్పినట్టు ఆలయానికి, చెట్టుకు మధ్య ఉన్న నుయ్యి దగ్గరకు వెళ్ళి లోపలకు వంగి చూసింది. ఆ నుయ్యి బాగా విశాలంగా ఉంది. చాలా లోతుగా ఉంది. చూడ్డానికే అది భయంకరంగా కనబడు తూంది. సుమతి నూతి చుట్టూ తిరిగి ఒకసారి నూతికి చేతు లెత్తి నమస్కరించింది. పవిటను బిగించి దోపి, మరు నిమిషంలో నూతిలోకి ఉరికింది.

నీటి లోతుకు పోయిన సుమతి చాలా సేపటి వరకు మార్గం కోసం వెదకి ఊపిరి పీల్చుకోవడం కోసం నీటిపైకి

తేలింది. అదే సమయానికి అక్కడకు వచ్చి నూతిలోకి చూస్తున్న సన్యాసి పకపక నవ్వసాగాడు.

సుమతి అనుమానాశ్చర్యాలతో సన్యాసి వంక చూస్తూ ఉండి పోయింది.

'ఏం, మార్గం కనిపించ లేదా?' అన్నాడు సన్యాసి నవ్వుతూనే.

ఆ నవ్వులో ఏదో కుతంత్రం వుందని భావించింది సుమతి. 'అసలు మార్గం అంటూ ఉంటేగా-కనబడ్డానికి?...' అందామె కోపాన్ని అణచుకుంటూ.

సన్యాసి ముఖంలో కనబడుతూండే నవ్వు తొలగి పోయింది. అతని ముఖం జేవురించి గంభీరంగా మారి పోయింది. 'సుమతీ! చేత కాని పనులకు దిగి అనవసరంగా ఆవేశపడ్డం మంచిది కాదు. అందులోనూ ఆడవాళ్ళకు ఆగ్రహం పనికిరాదు. నేను చెప్పిన మాటలు అబద్ధమనుకుంటే పైకి వచ్చి మా చండీరాణిని అడుగు. ఆమె నీకు సమాధానం చెబుతుంది,' అన్నాడతను కోపంగా.

'ఎవరు మీ చండీరాణి? ఎక్కడుంది?'

'పైకి రా-చూపిస్తాను,' అని సన్యాసి సుమతిని నూతి లోంచి పైకి తీసి, ఆలయ సమీపానికి తీసుకు వెళ్ళాడు. 'మా చండీదేవి ఆలయంలో ఉంది. వెళ్లు, రాగమణి ఎక్కడ ఉందో అడిగి ఆమెను చేరే దారి కూడా తెలుసుకో. వెళ్లు,' అన్నాడు.

'చండీరాణి మీ దేవతా?!' ఆశ్చర్యంగా అడిగింది సుమతి.

'దేవతో, దయ్యమో ... అడుగు...' అన్నాడు సన్యాసి.

సుమతి ఒక ... ంలోకి చూసింది. అదే

సమయంలో ... కళ్ళల్లోకి తీక్షణంగా

చూశాడు.

సుమతి ఆ చూపులో ఉన్న చురుకుతనాన్ని తట్టుకోలేక పోయింది. వెంటనే తల దించుకుని ఆలయం వైపు నడిచింది. తలుపులు తీసి లోపలకు చూసింది. దేవీ విగ్రహం ఉగ్ర రూపం ధరించి కనబడుతూంది. సుమతి ఆ మూర్తిని చూసి చేతులు కలిపి నమస్కరించి 'తల్లీ! జగజ్జననీ! లోకమాతా! రాజకుమారి ఉన్న చోటు చెప్పి అక్కడకు వెళ్ళే ఉపాయం చెప్పు తల్లీ!' అంది.

సుమతి అలా అనగానే విగ్రహం చలించింది. చేతులు, కాళ్ళు కదలసాగాయి. విగ్రహ రూపంలో ఉన్న దేవి నిజ రూపం దాల్చి సుమతిని చూసి 'మూర్ఖురాలా! నా భర్తృణ్ణే అనుమానించి, అవమానపరచావు. ఇక నా సలహా నీకెందుకు అక్కరకొస్తుంది? నిన్నిక ఉపేక్షించి విడిచిపెట్ట కూడదు,' అంటూ చేతిలో ఉన్న కత్తిని పైకెత్తింది.

సుమతి ఆ దృశ్యం చూసి కంపించిపోతూ 'తల్లీ! అపరాధం మన్నించు,' అని దేవి కాళ్ళ మీద పడిపోయింది.

అయినా దేవి కనికరించలేదు. 'భర్తలను చులకన చేసిన వాళ్ళను క్షమించకూడదు,' అంటూ ఆమె తన ఎడమ చేతితో సుమతి భుజాన్ని తాకి 'పాతాళానికి పో!' అంది.

సుమతి ఉన్న స్థలం కదిలింది. ఆమె భయంగా ఎదుటకు చూసింది. దేవీ విగ్రహం ఆమె కళ్ళ ముందు కనపడసాగింది. తన ముందు కనబడుతూన్నది దేవీ విగ్రహమో, లేక నిజ స్వరూపమో తెలుసుకునేంతలో సుమతి నిలబడి ఉన్న స్థలం ఆమెతోపాటుగా క్రిందకు దిగబడి పోయింది.

పూజను ముగించిన స ... గుణసాగర్ వైపు చూశాడు

గుణసాగర్ అప్పటివరకు మౌనంగా కూర్చుని తంత్రవేత్త ముఖంలోకే చూస్తూ ఉండిపోయాడు. అలస్యమయ్యే కొలదీ ఆతృత పెరిగిపోతూంది. క్షణ క్షణానికి తంత్రవేత్త ముఖంలో కనబడుతూన్న మార్పులు గుణసాగర్ హృదయాన్ని కలచివేస్తున్నాయి. నిమిష నిమిషానికి అతనిలో ఉన్న ఓర్పు నశించసాగింది. సహనం మరుగు పడిపోతూంది. ఇక మౌనంగా కూర్చుండడం అతని శక్తికి మించిన పని అయింది.

గుణసాగర్ కూర్చున్న చోటులోంచి లేచి తంత్రవేత్తను సమీపించాడు. నోరు విప్పి ఏదో అడగాలనుకుంటున్నాడు. అంతలోనే తంత్రవేత్త కళ్లు విప్పి గుణసాగర్‌ని చూచాడు.

'ఆచార్యా! రాగమణి కనిపించిందా? ఎక్కడుంది? ఎలా ఉంది? ఆమెకు ఎలాంటి అపాయం కలగలేదు కదా?' అన్నాడు గుణసాగర్ ఆందోళనగా.

తంత్రవేత్త చిన్న నిట్టూర్పు విడిచి 'రాజకుమారా! రాగమణి జాడ ఎక్కడా తెలియలేదు. ఎంత ప్రయత్నించినా ఆమె రూపం కూడా కనబడలేదు. నాకు ఈ విద్యలో ఉన్న శక్తినంతా ఉపయోగించాను. కాని, ఆమెను పద్మంలోకి రప్పించలేకపోయాను,' అన్నాడు విచారంగా.

'అయితే, నేనిక రాగమణిని చూసే అదృష్టం లేదా? ఆచార్యా! నిజం చెప్పండి. మీరేదో దాస్తున్నారని అనుమానంగా ఉంది. యదార్థం చెప్పి నా వేదన తీర్చండి,' అన్నాడు గుణసాగర్ దిగులుగా.

'రాజకుమారా! విచారించినందువల్ల లాభం లేదు. రాజకుమారిని నేను చూడలేకపోయిన మాట నిజం. అంత మాత్రం చేత దిగులుపడ వలసిన అవసరం లేదు. మళ్ళీ పద్మం వేసి చూస్తాను,' అన్నాడు తంత్రవేత్త.

గుణసాగర్ వెంటనే తంత్రవేత్త రెండు చేతులు పట్టుకుని 'ఆచార్యా! ఆలస్యం చేయకండి. తొందరగా చూడండి. నా మనస్సు అన్ని విధాలా క్షోభించిపోతూంది. రాగమణి క్షేమ వార్త చెప్పి నా ఆరాటం తీర్చండి,' అన్నాడు.

తంత్రవేత్త గుణసాగర్ స్థితిని అర్థం చేసుకున్నాడు. 'రాజకుమారా! దిగులు పడవద్దు. ఇక ఈ రోజున పద్మం వేయడం కుదరదు. నా నియమాన్ననుసరించి ఈ వేళకిక రాగమణి కోసం ప్రయత్నించడం జరగదు. నేనింత నిష్కర్షగా చెపుతున్నందుకు మన్నించండి. రాజకుమారి కోసం మీరెంత ఆవేదన పడుతున్నారో నాకు తెలుసు. ఆమె కొరకు మీ సర్వస్వం త్యాగం చేయడానికి సిద్ధంగా ఉన్నారు. దేశాన్ని విడిచిపెట్టారు; రాజ భోగాలను వదులుకున్నారు; మహా బలుడైన ప్రతాపసింహునితో పోరాటానికి తలపడ్డారు. రాజకుమారియందున్న మీ ప్రేమానురాగమే ఇదంతా చేయిస్తూందని నేనెరుగుదును. అయితే ఏమి చేయను చెప్పండి? నేను రోజుకు ఒక్కసారే పద్మం వేస్తాను; రెండవసారి పద్మం వేయడం నా నియమానికి విరుద్ధమైన పని. నేను చెప్పిన సమాధానం మీకు ఆగ్రహాన్ని కలిగిస్తుందనడంలో సందేహం లేదు. కాని, రాజకుమారా! ఒక్క మాట మాత్రం చెప్పగలను. మీ జాతకంలో రాజకుమారి రాగమణితోనే మీ వివాహమయ్యే యోగం ఉంది. అందుచేత ప్రస్తుతం ఆమె ఎన్ని కష్టాలు అనుభవించినా, చివరకు మిమ్మల్నే పెండ్లి చేసుకుని సౌఖ్యానందాలతో జీవితాన్ని గడుపుతుంది. అది నిజం. నా మాట నమ్మండి. శాంతంగా ఆలోచించండి. రేపటి వరకు ఓర్పు వహించండి. ఈ లోపున సుమతిని కలుసుకుందాం... పదండి. ఆమె వల్ల చాలా విషయాలు తెలుస్తాయి,' అంటూ అతను లేచి నిలబడ్డాడు.

తంత్రవేత్త రెండవసారి పద్మం వేయడానికి వ్యతిరేకించడంతో రాజకుమారునికి చాలా కోపం వచ్చింది. కాని, తంత్రవేత్త చెప్పిన మాటలు విన్న తర్వాత అతనికి కోపంతోపాటు ఆనందం, ఆశ్చర్యం కూడా కలిగాయి.

గుణసాగర్ కోపాన్ని అణచుకుని 'ఆచార్యా! పద్మంలో కనిపించని రాజకుమారి బ్రతికే ఉందని నమ్మడానికి వీలుందా? ఒకవేళ ఆమె బ్రతికి ఉన్నా, ఆమె ఎక్కడుందో తెలుసుకోలేనప్పుడు సుమతిని మాత్రం ఎలా కలుసుకోగలం?' అన్నాడు నిస్పృహతో.

'రాజకుమారా! రాజకుమారిని చూడాలని ఎన్నిసార్లు ప్రయత్నించినా, ఆమె పద్మంలోకి రాకపోవడంతో సుమతిని చూడాలని అనుకున్నాను. మరు నిమిషంలో ఆమె నా కళ్ళ ముందు వచ్చి నిలబడింది-' అని తంత్రవేత్త యింకా చెప్పబోతుండగా గుణసాగర్ సంతోషాన్ని పట్టలేక 'ఆఁ! అయితే రాగమణి కూడా ఆమెతోనే ఉంటుంది,' అన్నాడు ఉత్సాహంగా.

'తొందర పడకండి. నేను చెప్పేది సావకాశంగా వినండి!' అంటూ మళ్ళీ తంత్రవేత్త ఇలా చెప్పడం మొదలు పెట్టాడు: 'సుమతి నాకు కనిపించినపుడు యీ అడవిలోనే పళ్ళు కోస్తూంది. అప్పుడు ఆమె ముఖంలో దిగులు, విచారం ఎక్కడా కనిపించలేదు. ఆమె నీరసంగా ఉన్నా, చాలా ఉత్సాహంగా ఉంది. ఒడి నిండా పళ్ళు కోసుకుని నడవడం ప్రారంభించింది. ఆమె వెడుతూన్న వైపు కొంచెం దూరంలో క మైదానం ఉంది. నేనెపుడూ ఈ అడవి దాటి వెళ్ళి వరకూ ఆ మైదానం చూడలేదు. మొదటి సారిగా డే పద్మంలో చూశా... ...రిలా ఉన్న ఆ మైదానంలో ...డా జన... ...శ్మానుష్యంగా ఉన్న ఆ

ప్రాంతానికి నిర్భయంగా వెడుతూన్న సుమతిని చూడగానే నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఆ మైదానాన్ని బాగా ఎరిగున్న దానివలె ఆమె చురుగ్గా నడచి పోతూంది...'

గుణసాగర్ మళ్ళీ తంత్రవేత్త చెబుతూన్న మాటలకు అడ్డు వచ్చాడు. 'ఆచార్యా! రాగమణి కూడా ఆ ప్రాంతం లోనే ఎక్కడో ఉండి ఉంటుంది,' అన్నాడు ఆనందంగా.

తంత్రవేత్త తలెత్తకుండానే చెప్పుకు పోతున్నాడు: 'నేను కూడా అలానే అభిప్రాయ పడ్డాను. వెంటనే రాగమణిని పద్మంలోకి రప్పించడానికి పూనుకున్నాను. కాని, ప్రయోజనం లేకపోయింది. ఆమెను చూడాలను కున్నప్పుడల్లా నిర్మానుష్యమైన ఎడారిలాంటి మైదానం మాత్రం కనబడ సాగింది. ఆఖరుకు విధిలేక మళ్ళీ సుమతి కోసం గాలించాను. ఈ సారి సుమతి కూడా కనబడ లేదు. కేవలం ఆ మైదానమే కళ్ళ ముందు కనబడేది! రాజకుమారా! ఆలస్యం చేయకండి. మనం తొందరగా సుమతి పళ్లు కోసిన ప్రాంతాన్ని చేరుకుని, మైదానాన్ని చూస్తే బాగుంటుంది. రండి, వెడదాం!' అన్నాడు తంత్రవేత్త.

గుణసాగర్ ఇక ఏమీ మాట్లాడ లేదు. తంత్రవేత్త ముందు నడుస్తూండగా గుణసాగర్ అతన్ని అనుసరించాడు.

## 44

ఇద్దరూ సుమతి పళ్ళు కోసిన ప్రాంతానికి వచ్చారు. సద్గుణ తంత్రవేత్త ఆ ప్రదేశాన్ని బాగా నిదానించి చూస్తూ 'రాజకుమారా! ఏమీ సందేహం లేదు. సుమతి ఇక్క ఉండగానే నాకు కనబడింది. చూడండి, ఆ చెట్ల కొవ నుండి పళ్లు కోసిన గుర్తులు కనబడుతూన్నాయి,' అని వైపు వ్రేలితో చూపించి పళ్ళు కోసుకుని

వెళ్ళింది. రండి, అలా వెళ్ళి చూద్దాం,' అంటూ అతను ముందుకు రెండడుగులు వేశాడు.

గుణసాగర్ కదలకుండా నిలబడి సుమతి పళ్ళు కోసిన చెట్లల్లోకి నిదానించి చూస్తున్నాడు. అంతలో ముందుకు వెళ్ళిన తంత్రవేత్త భయంగా అరచి పరుగెత్తుకుంటూ వచ్చి గుణసాగర్ వెనకాల నిలబడ్డాడు. అతను కంపించిపోతూ 'రాజకుమారా! మనం వెళ్ళే మార్గానికి అడ్డుగా అడవి పంది కూర్చుని ఉంది. మనం అటు వెళ్ళడం మంచిది కాదు. మరో దారిని వెడదాం, వెనక్కు రండి.' అన్నాడు.

'ఆచార్యా! నేనుండగా ఏనుగు వచ్చినా మీరు భయపడనక్కర లేదు. రండి, ఈ దారినే వెడదాం.'

'రాజకుమారా! నా మాట వినండి. అది సామాన్యమైన పందిలా లేదు. చాలా భయంకరంగా ఉంది. దాన్ని చూస్తేనే ప్రాణాలు పోతాయి.'

'ఏమీ ఫర్వాలేదు. నా వెనకాల రండి,' అని గుణసాగర్ కత్తి చేత్తో పట్టుకుని ముందు నడవ సాగాడు. పదడుగులు నడిచేటప్పటికే ఎదుట మైదానం కనబడుతూంది. ఆ మైదానంలో మధ్యగా ఉన్న పాడుపడిన భవనం గుణసాగర్ దృష్టిలో పడ్డంతో అతని ఆనందానికి అంతులేక పోయింది. రాగమణి, సుమతి తప్పకుండా ఆ భవనంలోనే ఉంటారని అనుకున్నాడు. ఆ సంతోషంలో అతను అడవి పంది మాట మరచి పోయాడు. తొందరగా నడచి మైదానంలో కాలు పెట్టాడు.

సద్గుణ తంత్రవేత్త కూడా రాజకుమారుని వెనకాలే వచ్చాడు. అతను చుట్టూ చూస్తూ 'ఇంతలోనే ఆ పంది ఎలా పోయింది?' అన్నాడు ఆశ్చర్యంగా.

తంత్రవేత్త నోటినుండి చివరి మాట పూర్తిగా బయటకు రాక ముందే ప్రక్క పొదలో దాక్కున్న అడవి పంది వాళ్ళ ముందుకు వచ్చి నిలబడింది.

పంది కనిపించగానే గుణసాగర్ దాని మీదకు ఉరికాడు. ఆ పంది కూడా కోరలు పెరిగిన నోటిని చాపి గుణసాగర్ మీద పడింది. గుణసాగర్ దానితో చాలాసేపు పోరాడాడు. కాని, అది ఎక్కడా లొంగకుండా దెబ్బలాడుతూ అతన్ని గాయపరచసాగింది.

పంది పోట్లాడే పద్ధతి చూసి తంత్రవేత్త చాలా భయపడ్డాడు. 'రాజకుమారా! ఆలోచించ వద్దు. వెంటనే సంహరించండి,' అన్నాడు కంగారుపడుతూ.

గుణసాగర్‌తో కలబడిన పంది ఒకసారి తంత్రవేత్తను చూసింది. అతని మాట పూర్తయ్యేటప్పటికి అది గుణసాగర్‌తో పోర్డాడం మాని, తంత్రవేత్త మీదకు పరుగెత్తుకుంటూ రాసాగింది.

ఏనుగు గున్నలా ఉన్న ఆ పంది తన మీదకు వస్తూండడం చూసి తంత్రవేత్త వాడలిపోయి 'రాజకుమారా! రక్షించు! రక్షించు!' అన్నాడు.

అంతలోనే గుణసాగర్ తంత్రవేత్త మీదకు వస్తున్న పందిని వెనుక కాలు పట్టుకుని ఆపు చేశాడు. పంది కోపంతో వెనక్కి తిరిగే లోపల అతను కత్తితో దాని కాలు నరికి వేశాడు. మూడు కాళ్ళ పంది ఇక ముందుకు వెళ్ళలేక పోయింది. రాజకుమారునితో పోరాడ్డానికి కూడా ఇక దానికి సాహసం లేకపోయింది. అది భవనం వైపుకు పారిపోవడం ప్రారంభించింది. రాజకుమారుడు దాన్ని విడిచిపెట్టకుండా వెంబడిస్తూ 'ఆచార్యా! రాగమణి, సుమతి ఆ భవనంలోనే ఉంటారు. వాళ్ళకు ప్రమాదం సంభవించకుండా ఉండా

అంటే, దీన్ని మధ్యలోనే అంతం చేయాలి, రండి!' అన్నాడు. ముందు పారిపోతూన్న పంది రాజకుమారునికి దొరక్కుండా భవనం చుట్టూ ఉన్న ప్రహారీ గోడ దగ్గరకు చేరింది. అది అక్కడనుంచి గోడను అంటిపెట్టుకుని పరుగెత్తసాగింది. గుణసాగర్ దాన్ని విడిచిపెట్టకుండా తరుముతున్నాడు.

పంది అలా కొంత దూరం వెళ్ళి, ఒక చోట ఆ గోడకున్న కన్నంలో దూరిపోయింది. రాజకుమారుడు కూడా అక్కడకు వెళ్ళి నిలబడ్డాడు. అతనా కన్నం చూసి చాలా ఆశ్చర్యపడ్డాడు. కష్టపడితే మనిషి దూరగలుగుతాడా కన్నంలో! 'అంత పెద్ద పంది ఆ చిన్న కన్నంలోంచి ఎలా దూరగలిగిందా!' అని ఆలోచిస్తూండగా తంత్రవేత్త కూడా అక్కడకు వచ్చి నిలచాడు.

గుణసాగర్ తంత్రవేత్తను చూసి 'ఆచార్యా! చాలా చిత్రంగా ఉంది! ఆ పంది ఈ రంధ్రంలోంచి లోపలకు పోయింది. రండి చూద్దాం,' అని గుణసాగర్ నెమ్మదిగా ఆ కన్నంలోంచి లోపలకు చొరబడ్డాడు. తంత్రవేత్త కూడా లోపలకు వచ్చాడు. కాని, పంది మాత్రం ఇక వారికి కనబడలేదు. అయితే దాని శరీరాన్నుంచి కారి నేల మీద పడి ఉన్న రక్తపు చుక్కలు చూసుకుంటూ ఇద్దరూ ముందుకు నడవసాగారు.

కొంత దూరం వచ్చేసరికి ఆ రక్తపు చుక్కలు వారిని ఒక భవనం ముందుకు తీసుకు వచ్చి విడిచిపెట్టాయి. అక్కడినుంచి ఇంకెలాంటి గుర్తులూ వారికి కనిపించలేదు!

ఇద్దరూ ఆశ్చర్యంగా ఆ భవనాన్నొకసారి నిదానించి చూశారు. పాల రాతితో తయారైన ఆ భవనం వారి కళ్ళను మిరుమిట్లు గొల్పుతూంది. దాని నైపుణ్యం వారిని దిగ్భ్రాం

తుల్ని చేసింది. నిర్మాణ విధానం ఉభయులను పులకితుల్ని చేసింది.

గుణసాగర్ రెప్ప వేయకుండా ఆ భవనాన్నే చూస్తూ 'ఆచార్యా! ఇంతటి అపురూప భవనం ఈ అరణ్యంలో ఎవరు నిర్మించారు? ఇప్పుడీ భవనంలో ఎవరుంటున్నారు? ఈ ప్రదేశం ప్రతాపసింహుని రాజ్యంలోనిదే! అందులో ఏమీ సందేహం లేదు. ఈ భవనాన్ని అతనే కట్టించాడా?' అన్నాడు.

తంత్రవేత్త తల అడ్డంగా త్రిప్పాడు. 'ఈ ప్రదేశం ప్రచండ దుర్గం లోనిదే! కాని, దీన్ని ప్రతాపసింహుడు మాత్రం నిర్మించ లేదు. ఈ భవనం అతనే తయారు చేయించి ఉంటే నాకు తెలియకుండా ఉండదు,' అన్నాడతను.

'ఆచార్యా! దీని సౌందర్యం చూస్తుంటే నా కెందుకో నూతనోత్సాహం కలుగుతూంది. ఇక్కడ వరకూ వచ్చి మాయమైన పంది ఇక మనకు దొరుకుతుందనే ఆశ లేదు. దాన్ని వెదకడం కూడా అనవసరం. రండి, లోపలకు వెళ్ళి ఈ భవనంలో ఎవరైనా ఉన్నారేమో చూసి వద్దాము,' అన్నాడు గుణసాగర్.

తంత్రవేత్త అందుకు అంగీకరించడంతో యిద్దరూ నెమ్మదిగా గుమ్మం దగ్గరకు వెళ్ళి నిలబడ్డారు. తలుపులు మూసి ఉన్నాయి. పిలవడమా, మానడమా అనుకుంటూండగా వారికి లోపలనుంచి గజ్జెల మ్రోత వినబడసాగింది. కాసేపు ఆ శబ్దం విన్న తర్వాత 'ఆచార్యా! లోపల ఎవరో నృత్యం చేస్తున్నారు!' అన్నాడు గుణసాగర్.

దీర్ఘాలోచనలో మునిగి పోయిన తంత్రవేత్తకు గుణసాగర్ అన్న మాట వినపడ లేదు. రాజ కుమారుడు కూడా తంత్రవేత్త ముఖంలోకి ఒకసారి చూసి, అతన్ని కాసేపటి వరకు

పలుకరించ కూడదనుకున్నాడు. మౌనం వహించి అతను ఆ నృత్యం చేస్తున్నవారి ప్రావీణ్యతకు అబ్బుర పడుతున్నాడు.

కొంత సేపటికి తంత్రవేత్త ఆలోచనల్లోంచి తేరుకుని గుణసాగర్‌ని చూశాడు. 'రాజకుమారా! ఇక్కడి వాతావరణం చాలా అయోమయంగా కనబడుతూంది. మనం అరణ్యంలోంచి మైదానంలో కాలు పెడుతూండగా శిథిలావస్థలో ఉన్న భవనం చూశాము. అక్కడే అడవి పంది మిమ్మల్ని ఎదిరించి పోరాటానికి తలపడింది. చివరకు పరాజయం పొందిన ఆ పంది మనల్ని ఇక్కడ వరకూ లాక్కు వచ్చి అదృశ్యమైంది. ఇక్కడి దృశ్యం బయట కనబడిన దానికి పూర్తిగా విరుద్ధంగా ఉంది. అక్కడ శిథిల భవనం; ఇక్కడ పాలరాతి సుందర భవనం! అక్కడ క్రూర జంతువు యొక్క భయంకర ఘుర్‌ఘుర ధ్వని; ఇక్కడ సుకుమార సుందర నృత్య కాలక్షేపం వల్ల వినబడుతూన్న చిరు గజ్జెల శబ్దం! అక్కడ భీభత్స పోరాటం; ఇక్కడ నిర్మల ప్రశాంతం! ఒకే సమయంలో ఇక్కడికక్కడే ఒక దానితో మరొక దానిని పోల్చడానికి వీలు లేని విపరీత వాతావరణం! చాలా విచిత్రంగా ఉంది!' అన్నాడతను నెమ్మదిగా.

'లోపలకు వెడితే అంతా తెలుస్తుంది,' అంటూ గుణసాగర్ తలుపుల మీద చెయ్యి వేసి త్రోశాడు. వెంటనే రెండు తలుపులూ తెరుచుకున్నాయి.

## 45

గుణసాగర్, తంత్రవేత్త లోపలకు తొంగి చూశారు. అది చాలా పెద్ద హాలు. హాలు మధ్య ఏడు మెట్లున్న ఎత్తైన సుంద్రని వేదిక ఉంది. సాటి లేని రూపవతి, నవ యౌవనవతి ఆ వేదిక మీద నృత్యం చేస్తూంది. ఆమె కుడి చేతిలో పొడవైన కత్తి, ఎడమ చేతిలో చిన్న పుస్తకం ఉన్నాయి. తన్మ

యత్వంలో మునిగిపోయి నృత్యం చేస్తూన్న ఆమె దేవకాంతలా కనబడుతూంది.

ఆమె నృత్య పాటవానికి ముగ్ధులైన గుణసాగర్, సద్గుణ తంత్రవేత్తలు చప్పుడు కాకుండా హాలులో ప్రవేశించి ఆ నృత్యాంగనను తదేక ధ్యానంతో చూస్తూ నిలబడిపోయారు.

నృత్యాంగన తనకు ప్రపంచంతో సంబంధం లేనట్టు, నృత్యమే తన జీవిత లక్ష్యంలా ఒక వైపున దానియందు శ్రద్ధాభక్తులు చూపుతూ, మరొక వైపున నృత్య కళంతా తన సొంతమైనట్టు యథేచ్ఛగా నృత్యం చేస్తూంది.

బాల్యంలోనే అన్ని విద్యల్లోనూ ఆరితేరిన గుణసాగర్ నృత్యంలో ఆమె చూపుతున్న ప్రతిభను చూసి మంత్రముగ్ధుడైపోయాడు.

తంత్రవేత్త ఆమె సుందరవదనాన్ని, నృత్యపాటవాన్ని తిలకిస్తూ ఈ లోకాన్నే మరచిపోయాడు.

అలా కొన్ని గంటలు గడచిపోయాయి. నృత్యాంగన తన నృత్యంలో అనేక భంగిమలు చూపుతోంది. కనుపాపలతో ఎన్నో రకాల సన్నివేశాలను చిత్రీకరిస్తూంది. అవయవాలను కదిలించడం ద్వారా అనుకోని భావాలను ప్రదర్శిస్తూంది. కళ్ళల్లో ఉన్న తళుకు, కదలికలో ఉన్న చురుకు, భావ గాంభీర్యం, భంగిమల్లోని అంతరార్థం-తిలకిస్తూ ఆనందోత్సాహాల్లో మునిగి తేలుతూన్న గుణసాగర్ అకస్మాత్తుగా తంత్రవేత్త వైపు చూసి 'హస్తభూషణమైన పుస్తకాన్ని వేళ్ళ మధ్య ఇరికించి పట్టుకోవాలి గాని, అలా హారతి పళ్ళెంలా అర చేతిలో ఉంచి త్రిప్పకూడదు. అది నృత్య శాస్త్రానికి చాలా వ్యతిరేకమైన పని!' అన్నాడు గట్టిగా.

గుణసాగర్ అన్న మాటలు తంత్రవేత్తను పూర్తిగా చైతన్యణ్ణి చేశాయి. అప్పటి వరకూ ప్రకృతినే మరచిపోయి

ఉన్న తంత్రవేత్త గుణసాగర్‌కి ఏమని సమాధానం చెప్పాలో తెలియని అయోమయ స్థితిలో పడ్డాడు. అతను అంత వరకూ చూసింది కలో, యదార్థమో తెలుసుకో లేని సందిగ్ధావస్థలో ఉండి తన సందేహాన్ని తీర్చుకోడానికి ఒకసారి నృత్యాంగన వైపు చూశాడు.

ఇపుడామె నృత్యం చేయడం లేదు. రాజకుమారుని వంక ఆశ్చర్యంగా చూస్తూ నిలబడి ఉంది. గుణసాగర్ కూడా ప్రశాంతంగా ఆమె ముఖంలోకే చూస్తున్నాడు.

తంత్రవేత్త ఇద్దరినీ పరికించి చూసి ఆలోచనలో పడ్డాడు. పిశాచాలు ఒక్కొక్కప్పుడు కామ తృష్ణను తీర్చుకొనడానికి సుందర రూపాలు దాల్ ... మోసగిస్తూంటాయని అతనికి ప్రబలమైన న ... రూప సౌందర్యాన్ని వెదజల్లుతూ ఎదు ... చూడగానే పిశాచమే ఆ రూ ... పూర్తిగా అనుమానించా ... తో ట్రుపడ ... వేయు ...

'మేనకా! మేను మరపించిన నీ నృత్య ప్రావీణ్యతకు నా జోహార్లు. నీకు తగిన బహుమానమీయడానికి నా దగ్గర ఏమీ లేక పోయినందుకు చాలా విచారిస్తున్నాను,' అన్నాడు నెమ్మదిగా.

మేనక వేదిక చివరకు వచ్చింది. 'రాజకుమారా! మీ అభిమానానికి కృతజ్ఞురాలిని. ఇంతవరకు నా నృత్యంలో తప్పు పట్టుకుని నిరూపించిన వారు లేక పోయారు. నేటికి మీ వల్ల నాలో ఉన్న పొరపాటును గుర్తించ గలిగాను. మీరు మిక్కిలి నృత్యంలో మీకున్న సమర్థతను కూడా తెలుసుకున్నాను. నేటికి నా జన్మ తరించింది. బలవత్తరమైన నా కోర్కె తీరే సమయం
ఎన్నాళ్ళ నుండో నా కున్న వాంఛితాన్ని
న్నించమని ప్రార్థిస్తున్నాను,'

గుణసాగర్

అంతలోనే నృత్యానికి ఉపయోగపడే వాయిద్యాలన్నీ ఒక్కసారిగా వినబడసాగాయి. ఆ ధ్వని వినడంతో గుణ సాగర్ శరీరం పొంగిపోయింది. అతను ఉన్మత్తునిలా నృత్యం చేస్తున్న భంగిమలో వేదిక దగ్గరకు నడవసాగాడు.

తంత్రవేత్త గుణసాగర్ ఉద్దేశాన్ని గ్రహించి ఆందోళనతో అతనికి అడ్డుగా వచ్చి ఏదో చెప్ప బోతుండగా మేనక పక పక నవ్వి 'అయ్యా! మీరనుకుంటున్నట్టు నేను భూతాన్నీ కాను, పిశాచాన్నీ కాను. మీ రాజకుమారుడ్ని నేనేమీ కొరుక్కు తినను,' అంది.

తన మనసులోని భావాన్ని ఆమె ఎలా గ్రహించ గలిగిందో తెలుసుకోలేక తికమకలు పడుతూ తంత్రవేత్త ప్రక్కకు తప్పుకున్నాడు.

రాజకుమారుడు లయ తప్పకుండా అడుగులు వేస్తూ వేదికను సమీపించాడు. అప్పటికే మేనక వేదిక మధ్య నిలబడి గుణ సాగర్ వైపు చూస్తూంది. గుణసాగర్ ఒక్కొక్క మెట్టు ఎక్కుతున్నాడు. తంత్రవేత్త అప్రమత్తతతో ఆ యిద్దరినీ చూస్తున్నాడు.

మరు నిముషంలో మేనక, గుణసాగర్‌లు కలిసి నృత్యం చేయడం మొదలు పెట్టారు. ఇద్దరూ ఒకరికొకరు తీసిపోని ప్రజ్ఞను చూపిస్తున్నారు. వారి నృత్యంలో మొదట రతీ మన్మథులు కనిపించారు. కాసేపటికి ఆ ఇద్దరూ శంకర పార్వ తులుగా మారారు. అంతలోనే వేదిక మీద మోహినీ భస్మా సురులు కనిపించ సాగారు.

నృత్యంలోనే రూపాలు మారుస్తున్న మేనక, గుణసాగర్‌ల ప్రావీణ్యత చూసి తంత్రవేత్త విభ్రాంతుడౌతున్నాడు.

అంతలో మోహిని రూపంలో నృత్యం చేస్తున్న మేనక

పుస్తకం ఉన్న చేతిని వెనక్కి పెట్టుకుని, రెండవ చేతిని పైకెత్తింది. గుణసాగర్ కూడా అలాగే చేశాడు. మేనక పైకెత్తిన చేతిని తల మీదకు తీసుకుంటూంది. గుణసాగర్ మేనకను అనుకరిస్తున్నాడు.

అదే సమయంలో మేనక పైకెత్తిన చేతిలో ఉన్న కత్తిని బలంగా గుణసాగర్ కంఠం మీదకు విసరింది! గుణసాగర్ మొదలు నరికిన చెట్టులా క్రిందపడి విలవిల తన్నుకో సాగాడు.

తంత్రవేత్త ఆ దృశ్యం చూసి గుండె బాదుకున్నాడు. 'ఎంత ఘోరం జరిగింది! తెలిసుండీ నిన్ను పిశాచానికి బలి చేశాను!' అంటూ అతను గుణసాగర్‌ని సమీపిస్తూండగా ఆ హాలంతా వికటాట్ట హాసాలతో ప్రతిధ్వనించింది!



మహారాజు ప్రతాపసింహుడ్ని, అతని భార్య పద్మముఖిని కొండ గుహలో బంధించడానికి వెళ్ళిన జితేంద్రుడు, రణధీరు ఏమయ్యారు? శిథిల భవనంలోకి వెళ్ళిన రాజకుమారి ఎలా ఉంది? సుమతితో మాట్లాడిన సన్యాసి ఎవరు? రాతి విగ్రహం మాట్లాడ్డంలో ఉన్న రహస్యమేమిటి? భూమిలోకి దిగిపోయిన సుమతి గతి ఏమౌతుంది? రాజకుమారునితో పోరాడిన అడవి పంది ఏమైంది? నృత్యాంగన గుణసాగర్ మీద కత్తి విసరడానికి కారణమేమిటి? రాజకుమారి ఎవరిని పెళ్ళాడుతుంది? రాజు లేని ప్రచండ దుర్గాన్ని ఎవరు పాలిస్తారు? తెలుసుకోవాలంటే రాగమణి ఆఖరు భాగం 'ప్రణయ ఫలితం' చదవండి.

8-3

సెప్టెంబరులో విడుదల!




రచన: విశ్వప్రసాద్

త్రివర్ణ ముఖచిత్రం :: వెల: 1.25 నయాపైసలు.

"....నేను క్రొత్త కేడీని. ఆ పర్సులు నేనే దొంగిలించాను. అనవసరంగా ఆ కుర్రాణ్ణి బాధించకండి....కావాలంటే చూడండి.... ఆ పర్సులు...." అంటూ ఓ యువకుడు తన లెదర్ బ్యాగ్ తెరిచాడు .... కాని దానిలోను పర్సులు లేవు .... ఆ బ్యాగ్‌ను కూడా ఎవరో కత్తిరించారు....

కానిస్టేబుల్ అతని మాటలు నమ్మలేదు. కుర్రాణ్ణి విడిచిపెట్టలేదు. "ఇది మాయా ప్రపంచం సార్! ఈ కుర్రాడి మీద జాలిపడి, కష్టాల్ని కొనితెచ్చుకోకండి." అన్నాడు........

శ్రీ విశ్వప్రసాద్ మరో మహత్తర రచన 'పిక్-పోకెట్'

వివరములకు:

**ఎం.వి.యస్. పబ్లికేషన్స్,**

**(ఎం. వి. యస్. ప్రెస్)**

**66. కోడంబాక్కం హైరోడ్,**

**మద్రాసు 17.**

**Madhura Pranayam** **60 nP.**

కాపీలు సిద్ధంగా ఉన్నాయ్!
అతి తక్కువ వెలకు అత్యుత్తమ సాహిత్యం!!
శ్రీ ధనికొండ హనుమంతరావు రచించిన

## జగదేక సుందరి

# క్లియోపాత్రా

(అద్భుత చరిత్రాత్మక నవల)

త్రివర్ణ ముఖచిత్రం 575 పే. వెల: రు. **2.25**

ప్రపంచంలోని అందమూ, అధికారమూ, ఐశ్వర్యమూ, మేధస్సూ ఒకే స్త్రీ సొత్తు ఐనట్లయితే ఆమె జీవితం ఎలా పరిణమిస్తుంది? ప్రపంచం ఆమెను ఎలా భరిస్తుంది?

సింహంలాంటి సీజర్‌నూ, పులిలాటి ఏంటనీనీ పాదాక్రాంతుల్ని చేసుకోగలిగిన పడతి క్లియోపాత్రా. ఒక్క రోమన్ సామ్రాజ్యాన్నేగాక, లోకచరిత్రనే తారుమారు చేయగలిగిన అబల ఆమె! ఆమె కథ 20 శతాబ్దాలు జీవించింది.

చక్కని శైలిలో, ఉత్తమస్థాయిని రచింపబడిన ఈ నవల శ్రీ ధనికొండ రచనల్లో అగ్రస్థానం ఆక్రమిస్తుందని సస్సందేహంగా చెప్పవచ్చు....




**MADRAS-17.**



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B186 |
| పుస్తకం పేరు | మధుర ప్రణయం |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | BCT |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |